# ప్రకృతి

సచిత్ర సహజ వైద్య మాస పత్రిక

జనవరి
1944
సంవత్సర చందా
రు 3-0-0
బెజవాడ

## విషయ సూచిక

# ప్రకృతి చికిత్సా గ్రంథములు

## దురభ్యాసఖండనములు

| | వెల |
|---|---|
| జీవహింస | 0 4 0 |
| అనుభవానందము | 0 12 0 |
| మహారోగము | 0 8 0 |
| పొగచుట్ట — ముక్కు-పొడుం | 4 0 |
| పొగచుట్టవలని ప్రమాదములు | 1 0 |
| కల్లుముంత — సారాపీపా | 4 0 |
| ఔషధవైద్య మొకయూహాశాస్త్రము | 4 0 |
| టీకాలు వేయరాదు, యెందుకు? | 2 0 |
| టీకాలననేమి? డాక్టర్లఅభిప్రాయము | 2 0 |
| టీకాల ఖండన | 1 0 |
| పొగాకు ప్రమాదములు | 0 0 6 |

## ఆరోగ్యవిషయక గ్రంథములు

| | |
|---|---|
| స్వాభావికచికిత్సానియమములు | 0 5 0 |
| ఆరోగ్యాదర్శము | 0 8 0 |
| ప్రకృతిచికిత్సాఉపన్యాసములు 2 భాగములు, ఒక్కొక్కటి | 5 0 |
| బాలక్రీడలు | 3 0 |
| శిశుమాతల కొరకు సందేశము | 4 0 |
| ఆరోగ్యము — కామేచ్ఛ | 3 0 |
| దీర్ఘాయువు | 1 0 |
| సుఖప్రసవము | 1 0 |
| *ఆరోగ్యతత్త్వము | 0 0 |

## వివిధచికిత్సాగ్రంథములు

| | |
|---|---|
| పురుటాలు | 0 1 0 |
| *ప్రకృతి ఆరోగ్య వైద్యము | 1 4 0 |
| *ప్రకృతి గృహవైద్యం | 2 8 0 |
| *దీర్ఘరోగచికిత్సాసారము | 1 8 0 |
| ప్రకృతి చికిత్సార్ణవము | |
| 1. భాగము | 8 0 |
| 2. భాగము | 4 0 |
| 3. భాగము | 8 0 |
| 4. భాగము | 6 0 |
| 5. భాగము | 6 0 |
| 6. భాగము | 6 0 |
| 7. భాగము | 6 0 |
| ఉపవాసచికిత్స | 0 0 |
| జస్టుచికిత్స | 0 10 0 |

| | వెల |
|---|---|
| ధ్యానచికిత్స | 0 8 0 |
| జంబీరచికిత్స | 0 3 0 |
| యోగచికిత్స | 0 6 0 |
| సంవాహనచికిత్స | 0 6 0 |
| క్తప్రక్షాళనచికిత్స | 0 5 0 |
| వైదికచికిత్సాపద్ధతి | 0 5 0 |
| జాగరణ చికిత్స | 0 1 0 |
| నిశ్శస్త్ర శరీరపరిశోధన | 0 4 0 |
| వైద్యవిప్లవము | 0 8 0 |
| త్రిదోషములు | 0 6 0 |
| దీర్ఘాయువు | 0 1 0 |
| పృథ్వీచికిత్స | 0 2 6 |
| వివిధార్థసాగరము | 0 2 6 |

## వివిధవ్యాధులకు చికిత్సాగ్రంథములు

| | |
|---|---|
| క్షయ | 0 12 0 |
| శుక్లనష్టము | 0 12 0 |
| చలిజ్వరము | 0 4 0 |
| హిస్టీరియా (మూర్ఛ) | 4 0 |
| బాలెంతరోగము | 4 0 |
| మధుమేహము | 4 0 |
| మలబద్ధకము | 4 0 |

## వేదాంతము, ఇతరములు

| | |
|---|---|
| మహాయోగము | 0 12 0 |
| నిర్విచారజీవనము | 0 12 0 |
| యుక్తిప్రకాశము | 0 8 0 |
| రామతీర్థస్వామి వేదాంతోపన్యాసములు | |
| 1. భాగము | 8 0 |
| 2. భాగము | 8 0 |
| భగవద్గీతాసారము | 6 0 |

## ప్రకృతి వెనుకటి సంపుటములు

| | | |
|---|---|---|
| ప్రకృతి 4,5,6,7,11 సంపుటములు ఒక్కొక్కటి | వెల | 1 8 0 |
| ప్రకృతి 12,13,14,15 సంపుటములు ఒక్కొక్కటి | వెల | 3 0 0 |
| ప్రకృతి 16వ సంపుటము | వెల | 1 4 0 |
| 17,18,19,20,21,22,23 సంపుటములు | వెల | 3 0 0 |

చిరునామా: ప్రకృతి కార్యాలయట్రస్టు, బెజవాడ.

సంవత్సర చందా



రు 3-0-0

సహజవైద్య సచిత్ర మాసపత్రిక

సంపుటము 26 బెజవాడ సంచిక 1

జనవరి నెల, 1944

# బరువు ఆరోగ్యచిహ్నమా?

కొడాలి అచ్యుతరావు.
(ప్రాకృతవాది)

బరువు ఆరోగ్యచిహ్నమను దురూహ మనలో చాలమందికి కలదు. ఒకమనుష్యునియొక్క బరువు తగ్గినదని వినినప్పుడు మనము వాని ఆరోగ్యము తగ్గినదని తలచెదము. అట్లే యొక మానవునియొక్క తూకము పెరిగిన దని వినినప్పుడు వాని ఆరోగ్యము బాగుపడిన దని చెప్పెదుము. అవి యర్థరహితమైన మాటలంటాను నేను. బరువు జీవితపద్ధతుల మీద నాధారపడియుండును. ప్రకృతికి సంబంధించినది, తేలికగా, కులాసాగా, యుండుటయే ఆరోగ్యలక్షణము. అంతేకాని తూకము మాత్రము ఆరోగ్యలక్షణముకాదు.

తేలిక అంటే తక్కువ బరువని మాత్రము కాదు. తేలికగా యుండుట అంటే, తక్కువగాని ఎక్కువగాని బరువు కావచ్చు. తేలికగా నుండుట యనునది మనకు సంబంధించినది. అది కాటామీద తూకము వేయుట మాత్రము కాదు. తేలికయనునది కులాసానుబట్టి తెలిసికొననలయును.

దేహపదార్థముయొక్క ప్రతిబొస్సను కూడా మనమే మోయవలెను. బరువునంతను మనము సునాయాసముగ మోయకల్గినచో మనము ఆరోగ్యముగా నున్నామని చెప్పవచ్చును. ఎక్కువ బరువుకల్గిన వారిని మనము ఆరోగ్యవంతులని తలచెదము. కాని వారు రోగమునకు గురియైనపుడు అకాలముగా మరణించుట తటస్థించును. ఈజాతికి చెందిన మనుష్యులను నేను నా అనుభవములో చూచితిని. వారు బయటకు దృఢకాయులుగా కనపడెడివారు. కాని వారి దేహము లోపలి భాగమంతయు రోగపదార్థముతో నిండియుండును. అసలటువంటి వారు చనిపోవుటకు చికిత్సాలోపమే. వా రుపవసించుటకు తగిన యవకాశ మివ్వరు. అవసరమునకు మించిన బరువుండుటయే రోగమునకు కారణమని తెలియవలెను. సత్యమేమంటే, తేలికగా నున్న మనుష్యుడు రోగము వచ్చినపుడు బ్రతికి బయటపడతాడు. ఎక్కువ బరువుగా నున్న

వాడుమాత్రి మట్లుకాదు. వ్యతిరేకముగా నుండును.

జ్వరము వచ్చుటకు పూర్వము బరువు ఎక్కువగా నుండును. ప్రకృతి అవసరమునకు మించిన బరువును ఒప్పుకొనదు. కనుకనే ఆమె జ్వరమును శిక్షగా విధించును. ఎక్కువ బరువును తగ్గించుటకొరకే జ్వరము వచ్చును. ఆరోగ్యమునకు భంగము లేకుండ యుండవలెనన్న, యవసరమునకు మించిన బరువును పెంచుకొనరాదు.

మందువైద్యులు వయస్సును బట్టి, ఎత్తునుబట్టి, బరువుండునని ప్రమాణమైన పట్టికలను నిర్ణయించిరి. ఈబరువుల పట్టికలన్నియు తప్పని డాక్టరు లియోనార్డు విలియమ్స్ జీవితభీమా సందర్భములో ఋజువుచేసినాడు. అతడు తక్కువ బరువు కలవారిలోకన్న, నెక్కువ బరువుకలవారిలోనే యెక్కువ మరణములున్నవని చూపించినాడు.

మందువైద్య శాస్త్ర మను ప్రపంచములో నరుడుగ నెవ్వరైన నొక రేకకంఠముతో, తనసోదరులుచేయు తప్పిదములను లోకమునకు చాటుచున్నారు. కాని యతని ప్రచార మరణ్యరోదనమగుచున్నది. మిగిలిన సోదరులు బధిరులు. అందుచేతనే శాస్త్రము వెనుకటి వలెనే తప్పులు చేయుచు, వక్రమార్గమున ప్రయాణము చేయును. ఆమందునందు శాస్త్రజ్ఞులకు సత్యమునకన్న మూఢనమ్మకయే యెక్కువ. ఎందుచేతనంటే, అతడు ఆచారదేవతకు దాస్యముచేయుట కలవడియుండును.

ఒక మందుపత్రిక (Medical magazine) లో ఒకవ్యాసమును చూచితిని. దానిలో యిట్లున్నది. "తిండిపోతులకన్న మితముగా భుజించి బక్కపల్చగా నున్నవారిలోనే రోగనిరోధకశక్తి ఎక్కువగా నుండును. కనుకనే మితముగ భుజించువారు అంటువ్యాధులకు గురికారు". దానికి కారణమిది. మితముగా భుజించువారిలో సమృద్ధిమైన ధాతుశక్తి వుండును ఆధాతుశక్తి వలన విషజీవులు మారణమగును. తిండి పోతులలో అవసరమున కుపయోగపడు ధాతుశక్తి తక్కువగ నుండును. ఎందువల్లనంటే వారికున్న ధాతుశక్తి సంతయు నెక్కువ స్వీకరణ (Assimilation) లో నుపయోగించెదరు. సూక్ష్మజీవి సిద్ధాంతమును రూపుమాపుట కిదియే తగిన ప్రాకృతచికిత్సా సిద్ధాంతము. "నిరోధము" అను మాట కసలు మా శాస్త్రములో తావులేదు. ధాతుశక్తి శరీరముయొక్క బరువుమీద నాధారపడి యుండదు. సరియైన శారీరకబరువు మందువైద్యులిచ్చిన పట్టికలలోని ప్రమాణమైన బరువుకన్న చాల తక్కువగ నుండును. వారిచ్చిన పట్టికలలోని ప్రమాణమైన బరువునకన్న, యిరువది పౌనులు తగ్గించుకొని పోల్చుకొనిన యెడల అది ప్రమాణమైన బరువని డాక్టరు విలియమ్స్ చెప్పుచున్నాడు.

ఈ విషయమును విపులముగా తెలియజేయుట కొక్కని చరిత్ర నుదాహరించుచున్నాను. అతడెక్కువగా పొగపీల్చెడివాడు. తత్ఫలితముగ దగ్గువచ్చెడిది. ఆ దగ్గు క్షయవ్యాధిగ మారవచ్చునని కొందరు సలహాయిచ్చిరి. భయపడి బెజవాడవచ్చి ఒక సుప్రసిద్ధమందు వైద్యునివద్ద మందులను సేవించినాడు. చికిత్సా కాలమంతయు ఎక్కువ మాంసకృతులు కలిగిన కోడిగుడ్లు, మాంసము, పాలు అతని యాహారము. అవి బలవర్ధకములని వారి యుద్దేశ్యము. తూకములో అతడు 120 పౌనుల నుండి 150 వరకు పెరిగినాడు. దగ్గుమాత్రము తగ్గ

లేదు. ఎలాతగ్గుతుంది? పాపము బలవర్ధ కాహారము దగ్గరయొక్క పోషణ కుపయోగపడినది. ధాతుశక్తి యింకను క్షీణించినది. ఇట్లారు నెలలు గడచినవి. ఆ పేరుపొందిన డాక్టరుగారు నివారణకాదని చెప్పుచు మదనపల్లి వెళ్ళుమని సలహాయిచ్చినాడు. "నేను అసమర్థుడను.నామందులసమర్థములు. దయామయురాలగు ప్రకృతిని ఆశ్రయించండి" అని యర్థము. అప్పటికతనికి మందులవల్ల ఊపిరితిత్తులు బాగుగ తూట్లుపడినవి. తరువాత చరిత్ర మనకప్రస్తుతము,అనవసరము. ఇంతదూరమెందుకు వ్రాసితినంటే, ధాతుశక్తి బరువుమీద ఆధారపడి యుండదనియు, ఎక్కువ బరువు ఆరోగ్యలక్షణము కాదనియు ఋజువు పరచుటకు. అతనికి బరువు పెరిగినకొలది ఆరోగ్యము క్షీణించినది. ధాతుశక్తి క్షయమైనది. రోగము నివారణకాలేదు. షుమారు 1500 రూపాయలు వ్యయపడినాడు. ఇంతడబ్బు ఖర్చుపెట్టి మందులుతిని సంపాదించుకొన్నాడు, పాపము, క్షయవ్యాధిని. మందువైద్యమని పిలువబడే అశాస్త్రీయమైన చికిత్సావిధానమునకు నా జోహారు. బూజుపట్టిన వైద్యశాస్త్రములో సంస్కరణ జరుగవచ్చునని యూహించుటకు కూడా వలనుపడకున్నది. ఇది కడుంగడు శోచనీయమైన విషయము.

దేహములోని సూక్ష్మాతిసూక్ష్మమైన సంపూర్ణభాగమునకు కణమని (Cell) పేరు. దీనినే కుటికయని కూడా పిలిచెదరు. దేహమంతయు కొన్నికోట్ల కణముల సమూహము. దేహమంతయు కలసి యే పనిచేయుచుండునో ఒక కణముకూడా అదే పనిని చేయుచుండును. కణము నొక సూక్ష్మదేహమని చెప్పవచ్చును. కొన్ని కణములు కలసి యొక ధాతువగును. (Tissue) ఆరోగ్యమునకు సంబంధించిన బరువు ఉపయోగమైన ధాతువు (serviceable tissue) మీద ఆధారపడి యుండును. ప్రతి రకపు ధాతువులోను కొంత భాగము మాత్రమే దేహవ్యాపారమునకు కావలెను. ఆ కనీసపు బరువు చేకూరినప్పుడు ధాతుశక్తి సమృద్ధిగా నుండును. మన కప్పుడు దేహమంతయు తేలికగా, కులాసాగా నుండుట తెలియును. శాస్త్రము, వైద్యశాస్త్రము కాదు - భౌతిక శాస్త్రము (Physical science). మనలను తప్పుదారి పట్టించు కాటాయంత్రమునకన్న, సమృద్ధిగానున్న ధాతుశక్తిని కొలుచుటకు యేదైన ఒక యంత్రమును కనిపెట్టిన మిక్కిలి ఉపయోగముగ నుండును.

భోజనమునకు సంబంధించిన యలవాట్లను (Eating habits) గూర్చి మనము జాగ్రత్త తీసుకొన్నచో, ప్రకృతి మనతూకమును గూర్చి తగిన శ్రద్ధతీసికొనును. దేహవ్యాపారమునకు ఎంతబరువవసరమో ప్రకృతికి తెలియును. ఆవిషయము యింకను వైద్యవరులకు తెలియదు. వారు వైద్యవరులుగా నున్నంత కాలము ఆవిషయము వారికి తెలియదు కూడాను.

ఒకరిమీద ఆధారపడియుండక ప్రతివారు స్వయముగా ప్రయోగముచేసికొని, ఫలితములను జాగ్రత్తగ తెలిసికొనవలెను. ప్రాకృత వైద్యుల మీదనైనను ఆధారపడియుండుట తప్పు. ఎవరికి వారే వైద్యులు కావాలి. ప్రాకృతవైద్యమును వృత్తిగా కాకుండ, గృహవైద్యము (Dom[illegible]ce) గా నభ్యసించవలెను.

'All dependence on others is misery. Dependence on self is

# కర్కాట వ్రణము

మా బావగారైన పిన్నమరాజు మూర్రాజుగార్కి ఎడమవైపు చెవికి దిగువున దవడ క్రింద గవదలాగున వాచి బాధపెట్టి గుటక వేయుటకు కష్టముగా ఉండి ఆహారము తినుటకు వీలులేకపోయినది. అప్పుడు ఆయుర్వేద వైద్యులు పాలాస్త్రీ వగైరా పట్టీలు వేస్తూ జావ వగైరా ఆహారములు ఇస్తూండగా, కొంచెము దవడ గుటక వేయుటకు స్వాధీనముగా ఉండేది. ఇట్లా 2 సార్లు తగ్గుట హెచ్చుట కలదు. తరువాత మళ్ళా 2 మాసములకు తిర్గి వెనకటికంటె హెచ్చుగా వాపు, బాధ కలిగి అంగుడంతా బాగా వాచి, మాట్లాడుటకు ఆహారము తినుటకు స్వాధీనములేకుండా నోరు కూడా చాచుటకు వీలులేని పరిస్థితివచ్చినది. నాలుక కూడా వాచినది. అప్పుడు నాకు కబురు చేసి చూపించినారు. నేను చూచి ప్రకృతి వైద్యము చేయించుదాము తగ్గుతుందని అంటే బంధువర్గమంతా కంఠములో కురుపుకు ఏ మెడ్రాసో విశాఖపట్నమో తీసుకువెళ్ళి వెంటనే ఆపరేషను చేస్తేగాని ఆహారము తినుటకు స్వాధీనము కాదు, ఇందుకు ప్రకృతివైద్యము ఏమి పని చేస్తుంది? మంచినీరు కూడా దిగని టైములో ఆలోచిస్తే ఏమి ప్రయోజనం లేదు, గనుక తప్పక ఎచ్చటికో చోటకు తీసుకువెళ్ళి తప్పకుండా ఆపరేషనేగాని రెండవ వైద్యము ఏమి లాభంలేదని చుట్టూ ఉన్న పరివారమంతా పట్టుదలతో ఉండగా, నాకు, ప్రకృతి డాక్టరుగారైన వేగిరాజు క్రిష్ణంరాజుగార్కి ఉండే స్నేహభావం వల్లను, ప్రకృతిమాత యందుండే ప్రేమ చేతను వారివద్దకు వెంటనే వచ్చి ఈ రోగవిధానమంతయు చెప్పగా వారిచ్చే సలహాను బట్టి రెండవ వైద్యములోనికి వెళ్ళుదామని బంధువర్గముతో చెప్పి వెంటనే కేశవరం ఈ డాక్టరుగారివద్దకు వచ్చి అచ్చట రోగి పరిస్థితి అంతయు మనవిచేయగా "ఏమి భయం లేదు, మనదగ్గరకన్న ఇతర చోట్ల గత్యంతర ముండదు, జాగ్రత్తగా చేయిస్తే ఇచ్చటనే బాగవుతుందని ధైర్యము చెప్పి, రోగిని కదుపుటకు వీలులేకపోతే, అచ్చటనే చికిత్సలు ప్రారంభం చెయ్యవలెను, జరూరుగా మీరు వెళ్ళి తొట్టిస్నానములు, ఎనిమా, ఉపవాసములు వగైరా చేయించమని సలహా ఇచ్చి పంపించినారు. వెంటనే తిర్గి నేను సాయంత్రమునకు యింటికి వెళ్ళి డాక్టరుగారు చెప్పిన సలహా ప్రకారము చికిత్సలు ప్రారంభం చెయ్యగా అరగంటకు శ్లేష్మము బయలుదేరి నోటి వెంట పడుట ప్రారంభమయినది. ఆ రాత్రి అంతయు అట్లాగే పడుచున్నది. ఊచుటకు స్వాధీనం లేక నోరు విడిచిపెట్టి ఒక కుర్చీలో తలపెట్టి రెండవ కుర్చీలో కూర్చుండబెట్టినాము. శ్లేష్మము పల్చబడి అదే ధారగా తెల్లవార్లు పడుచూనే ఉన్నది. ఇది అంతయు చూచి కంగారుపడి ఉదయం డాక్టరుగారివద్దకు కేశవరం తీసుకవచ్చితిమి. వెంటనే డాక్టరుగారు చికిత్సలు ప్రారంభించినారు. తరువాత నోరు అంతయు పరీక్షచేయగా నాలుకక్రిందనుంచి బెజ్జము పడుతుందని చెప్పినారు. చెప్పినట్లుగానే తెల్లవారేసరికి చిటికెనవ్రేలులావు బెజ్జం పడినది. శ్లేష్మము విపరీతముగా పడుట ప్రారంభించినది. సాయంత్రము 8 గంటల వరకు అట్లాగే వస్తూఉన్నది. 6 గంటలకు నోరు కొంచెము స్వాధీనమై గొంతుక బిగి తగ్గి మంచినీరు గుటక వెయ్యనిచ్చినది. 8 ఉపవాసములు పెట్టినారు. చికిత్సలు చేయుచునే



ఉన్నారు. నాలుకక్రింద పడ్డ బెజ్జమునుంచి **చీము,** రక్తము 4 రోజులవరకు పడినది. ఆ బెజ్జముపై దవడవద్దనుంచి లోపలకు కనుపించేది. 8 వ రోజుకు ఆ కుళ్ళంతయు తగ్గి బెజ్జము మానినది. శుభ్రముగా పూడిపోయినది. ఆశ్రమంలో 15 రోజులుంచి ఆహారమార్పులు అన్నియు చెప్పి ఇంటికి పంపించినారు. ముందు కంగారుపడ్డ పరివారమంతా అత్యాశ్చర్యపడి ఆపరేషనుకే అసలు వీలులేని కురుపు ఈ వైద్యములో ఎట్లా తగ్గినది? ఆపరేషనైతే ఏ 4 మాసములకో తేలును. 400 రూపాయలు ఖర్చు అవును. క్రియకు రోగి ప్రాణము నిలుచునో లేదో చెప్పలేము అటువంటి కదలలేని రోగి 10 ఉపవాసములైనాగాని 2 మైళ్ళ దూరం షికారు ఉత్సాహంగా వెళ్ళివస్తున్నాడు'' అని వారంతా చాలా సంతోషించి ఈవైద్యమునకు సాటి మరొకటిలేదని అప్పుడు నిర్ధారణ చేసినారు. ఈ వ్యాధి ఇప్పుడు తగ్గినా చాలా మొండివ్యాధి గనుక జాగ్రత్తగా 6 మాసములవరకు అపక్వాహారముతోనే ఉంచి జలచికిత్స చేస్తూ ఉండమని డాక్టరుగారు సలహా ఇచ్చినారు. అట్టి మాదిరిగానే చేసినారు. చాలా ఆరోగ్యవంతులై 6 మాసములయనంతరము మామూలు ఉప్పు, పులుసు, కారము వగైరా మామూలు ఆహారములు తిన్నప్పటికి ఏమి మార్పులేకుండా ఆరోగ్యముగా ఉన్నారు. మా గ్రామంలోనే మా బావగారితోపాటు ఇంక ఇద్దరకు ఈ వ్యాధి కొద్దిగా అంకురించి ఇతర చికిత్సలవల్ల ప్రమాదం సంభవించినది. ప్రతివ్యాధికి కూడా ప్రకృతిమాతను ఆశ్రయించి శ్రీ డాక్టరుగారి సలహాలను పొంది ఆరోగ్యవంతులవుదురు గాక.

రుద్రరాజు నరశింహరాజు
మా గ లం.

# మొండి గనేరియా కుదిరినది

**ఆశపడి విశేష వ్యయప్రయాసలకు లోనై రంగూన్ వెళ్లి అక్కడ నొక ప్రసిద్ధమైన ఆసుపత్రిలో ప్రవేశించాను, కాని ఆశలన్నీ అడుగంటగా అఘోరిస్తూ తిరిగి వచ్చాము. గాంధీ ఆయుర్వేదాశ్రమములో ఘనతరమైన ఔషధములన్నీ సేవించాను. కాని ఏమి ప్రయోజనము ?**

మాది కృష్ణాజిల్లాలో నాగాయతిప్ప అను గ్రామం. ఇప్పటికి ఆరు సంవత్సరముల క్రిందట నాకు "గనేరియా'' వ్యాధి సంభవించినది చిట్కావైద్యాలు, ఆకుపసర్లు వాడుతూ అందులో వంచదారకోసం ప్రత్యేకంగా పాతిక రూపాయిలు ఖర్చుపెట్టాను. బూడిదలో పోసిన పన్నీరైనది.

మా అన్నగారు రంగూన్ పట్టణములో నుండగా అక్కడ గొప్ప ఆస్పత్రుల్లో ఈ వ్యాధి తప్పక నివారించునని ఆశపడి విశేష వ్యయప్రయాసలకు లోనై వెళ్ళి అక్కడ నొక ప్రసిద్ధమైన ఆస్పత్రిలో ప్రవేశించాను. ఆరు మాసాలవరకు అనేక రకాలమందులు తాగాను. అసలు వ్యాధి హెచ్చిందేగాని

అణుమాత్రము తగ్గలేదు. ఆశలన్నీ అడుగంటగా అఘోరిస్తూ తిరిగి వచ్చాను.

మళ్లీ పల్లెటూరి వైద్యాలమీద భ్రాంతి పుట్టగా యాభై రూపాయలు వదలించుకొన్నాను. డబ్బు వదలుతున్నదేగాని రోగం మాత్రం వదలలేదు. అటుపైన ఆయుర్వేద వైద్యంకోసం బెజవాడలో మజిలీచేశాను. గాంధి ఆయుర్వేదాశ్రమములో ఘనతరములైన ఔషధాలన్నీ సేవించాను. బస్తీఖర్చులన్నీ భరిస్తూ మూడుమాసాల్లో దాదాపు నూరు రూపాయిలు తగలేశాను. తాత్కాలికంగా కొంత శాంతించిందిగాని మళ్లీ యింటికి జేరిన మూన్నాళ్ళకే ముంచుకొని వచ్చింది.

మూత్రద్వారమున చీము, రక్తము నిరంతరంగా స్రవించడమేగాక పోటు, మంట, చురుకు మొదలైన నరకబాధ లన్నీ భరించలేక పోయాను. బాధా! తగ్గదు. ప్రాణమా! పోదు. బ్రదుకు త్రిశంకుస్వర్గంలాగా పరిణమించింది.

తుట్టతుదకు దింపుడుగళ్లం ఆశతో కేవల్లె తాలూకా మునులతోటలో శ్రీ రాఘవేంద్ర యోగీశ్వరుల పాదాల నాశ్రయించాను. పరోపకారపరాయణులు, పరమదయా హృదయులు అగు శ్రీ వారు ప్రకృతి చికిత్స ప్రారంభించారు.

ప్రతిదినం ఉదయము సాయంత్రం పదేసి నిముషాలు కటిస్నానం, వారమునకు రెండు మార్లు ఆదిత్యపేటికాస్నానం, అభ్యంగ స్నానం చేయించారు. పగలు చప్పిడికూరలతో భోజనం, రాత్రిఫలాహారం, వారమున కొకదినం ఉపవాసం విధించారు. ఆ విధంగా 45 దినాలు నడచిన తర్వాత ఉదయం పది నిముషాల లింగస్నానంతో 27 దినాలు ఉపవాసం చేశాను. అంతటితో నా వ్యాధులన్నీ పటాపంచలైనాయి. ఆ పైన ఆకలికి ఆగలేక పోయాను. ఆ క్షణాన్నే తమిడజావతో పథ్యం పెట్టించారు. పగలు జావ, ఆకుకూరలునూ, రాత్రివేళ ఫలాహారము చేస్తున్నాను. నవీన తేజం, నూతనోత్సాహం పొందుతూ పూర్వం ఎంతదుఃఖం భరించానో అంతకు నూరు రెట్లు ఆనందం ఇప్పుడు అనుభవిస్తున్నాను.

క్షణ క్షణమూ నేను పెట్టే మొరలన్నీ శాంతభావంతో, సదయహృదయంతో ఆలకిస్తూ, సకలశ్రమలను సహిస్తూ ఉచితంగా చికిత్స జరిపి నన్ను ఉద్ధరించిన శ్రీ రాఘవేంద్ర యోగీశ్వరులవారి పాదపద్మములకు అనేక కృతజ్ఞతావందనములను అర్పించుచున్నాను. వారి ఋణం నేను తీర్చుకోజాలను. నా జీవితాంతంవఱకు వారి ఉపకారం మఱువలేను. ఇట్టి మహనీయులు ప్రకృతి వైద్యంచేత సకల మహావ్యాధులనూ సంహరిస్తూ ఉండగా అల్ప రోగాలకుకూడా అనవరతం ఆస్పత్రులచుట్టూ ప్రదక్షిణంచేస్తూ, అర్థమంతో వ్యర్థంచేసుకుంటూ, కాలాన్నీ, శరీరాలనీ, తుదకు ప్రాణాలనుకూడా పాడుచేసుకొనే ప్రజల చాదస్తాన్ని తలంచుకొంటే పట్టరాని పరితాపం ప్రాప్తిస్తూవుంది. బాగుపడదలచిన ప్రతిరోగికూడా ప్రకృతి వైద్యాన్ని శరణు జొచ్చి ప్రాణశక్తి సంపాదించి పరమానందం పొందగల డని భావిస్తున్నాను.

ఇట్లు,

గరికపాటి శ్రీరాములు.

# మాతృమూర్తి

కోట శ్రీరాములు
(సద్గతి)

"అరుగలేక బ్రతికి యున్నాను - జీవచ్ఛవంబనగుచు" ఇది 1923 వ సంవత్సరము నాటిమాట. అప్పట్లో ఒక శీతలవాయు ప్రవాహం బొంబాయి పట్టణం, పట్టణాన్నంతటినీ ఒక రాత్రి ఒక పగలూ స్తంభింపచేసిన రోజులవి. ప్రజలు వీధుల వెంట తిరుగనే లేకపోయారు" ఎక్కడవారక్కడే నక్కిపోయారు. ఔను! మానవ శక్తులు ఉద్రేకిస్తున్నప్పుడే ఎంతో బీభత్సంగా ఉంటుంటే పంచభూతశక్తులే జ్వలిస్తే ప్రళయం కాక ఇంకో మార్గం ఉంటుంది కనుకనా.

రెండురోజులు ఎట్లాగో గడచి గట్టెక్కారు. ఆరోజు భానువారమే గనుక భానుడు తన శతసహస్రకిరణాలతో ప్రజకు అభయమిచ్చాడు. భయం తీరిన ప్రజలు పార్కులకూ, సముద్రపు వంచలకూ, మలయపర్వత శిఖరానికీ నడకలు ప్రారంభించారు.

రాజన్నా, మూర్తి ఏదో పనిమీద తమ టెక్నికల్ ఇనిస్టిట్యూట్ వైపుకు వెళ్ళి పని చూచుకుని 3 గంటలకు చౌపాటీ బీచికి చేరారు. కాస్సేపు ఏదో మాట్లాడుకున్న తరువాత నేను సుందరంతో మాట్లాడివస్తానని రాజన్న కెనడీరోడ్డు వైపునకు వెళ్ళాడు.

మూర్తి కొంతసేపు ఆ చోద్యాలూ ఈ చోద్యాలూ చూచి, బీచి వెన్నంటే పార్కులోకి వెళ్లాడు. ఆ అల్లిబిల్లి లతలగుండా చిన్నదోవలగుండా తిరుగుతూ వచ్చి వచ్చి ఒక నీటి కుండీదగ్గరగా ఒక రాతిబెంచీమీద కూర్చున్నాడు. జేబులోని సిగరెట్టు తీసి అగ్గిపెట్టె కోసం అటూ యిటూ చూచాడు. ఆ కుండీ చుట్టుప్రక్కల జనం లేరుగాని ప్రక్కపొదను ఆనుచేసుకుని ఒకాతను కూర్చుని ఉన్నాడు. మూర్తి అతనివంక కొంతసేపు నిదానించి చూస్తూ "అగ్గిపెట్టె ఉందా? అని అడుగుదా మనుకున్నాడు గాని ఆ వ్యక్తి అటూ యిటూ కదలక శిలాప్రతిమలాగ కూర్చున్నాడు.

మూర్తి రెండడుగులు అతనివైపుకు నడచి నిలబడ్డాడు. ఆ వ్యక్తి తన రెండు హస్తాలతో ముఖాన్ని మూసుకుని చలించకుండా కూర్చున్నాడు.

మూర్తి అస్పష్టశబ్దంతో ఇంగ్లీషులో "మీదగ్గర అగ్గిపెట్టె ఉందా?" అని ప్రశ్నించాడు. అవ్యక్తి కొద్దిగా చలించి తలపైకెత్తుతూ "నన్నేనా......" అని దుఃఖపూరితమైన కంఠంతో వెక్కి వెక్కి అన్నాడు.

మూర్తి అర్థంకాని ఆలోచనలో బడి "ఔనండీ" అన్నాడు. అవ్యక్తి తలపంకిస్తూ ఎర్రబారిన తన రెండు కన్నులనూ పూర్తిగా విప్పి "నాయనా! నీవు తెలుగువాడివే! గాదూ? అని తెలుగులో అడిగాడు. మూర్తి "ఔనన్నట్టు" ఆశ్చర్యంగా తలఊచాడు. అయితే ఇదిగో నాదగ్గర నిప్పుపెట్టె లేదుగాని నేనే ఒక నిప్పుతో కుములుతున్న సెగడునై కూర్చున్నా! కావలిస్తే ఊది చూచుకో" అని గద్గదికంగా అచ్చతెనుగు మనిషిలాగా మాట్లాడాడు.

మూర్తి హృదయం కంపించి - ఇతడు దేహం తెలియని స్థితిలో ఉన్నాడా ఏమిటి? కళ్ళు ఎఱ్ఱగా ఉన్నై - అనుకున్నాడు. మళ్ళీ వెంటనే హృదయం ద్రవించి అయ్యో! తెనుగువాడా ఏమిటి పుట్టెడు దుఃఖం ఉన్నట్టున్నాడు గాబోలు అనుకుంటూ ఏమో అడగా లనుకుంటున్నాడు.

అవ్యక్తి తాను కూర్చున్న చోటునుంచి అవతలికి వత్తిగిలి "ఇదిగో! చూడు! నీకు కనక తీరుబడి ఉంటే ఇట్లా వచ్చి కూర్చో, నిన్ను చూపెట్టుకుని నా హృదయ-భారం తగ్గించుకుంటూ - తాపోపశమనం చేసుకుంటూ - భగవంతుడు నా తెనుగు తండ్రిని చూపించాడనుకుంటున్నా" అన్నాడు. మూర్తి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు:— "నాయనా! నన్ను పిచ్చివాడిక్రింద తలచక - నేను అట్లాగే ఉన్నమాట వాస్తవము. ఈ రోజు నాకెంత దుర్దినమో అంత పవిత్రదినం కూడా - ఐతే దుఃఖావేశంలో ఉన్నానులే - దయవుంటే వచ్చి కూర్చో" అని దీనంగా చూచాడు.

మూర్తి దయాశీలుడు. తత్రాపి తన తెనుగువాడికంటి నీటిచుక్క చూచి సహించలేకపోయాడు - ఇట్టే నీటికుండలోంచి దోసెడు నీళ్ళు దీసుకుని - "ఇదిగో నీటితో ముందు ముఖం - కళ్ళూ తుడుచుకో! ఇంతకు మించిన పనిమాత్రం ఇంటివద్ద నాకేముంది కనుక —" అని అతనిచేతుల్లో పోశాడు.

ఆనీటితో అతను ముఖం తుడుచుకుంటూ - "అబ్బా! నాయనా! నా తెలుగుతండ్రి చేతినీళ్ళెంత చల్లగా ఉన్నైరా! ఈ క్షణంలో నాతండ్రిచేతితో నిట్టి ఉపశమనమే జరగకపోతే ఇంతవరకూ నాలో వెండ్రించిన దుఃఖాగ్నికి నా రక్తనాళాలు ఉబ్బి

చిటపటా చిట్లి రక్తం నేలపాలయేదేమో! కళ్ళు పేలి పోయి తల పగిలిపోయేదేమో! నా తండ్రీ దగ్గరకురా- నీవు నాకు అన్నివిధాలా బంధువుడవూ- నా కల్పతరువూ - నా కామదేవతవు లాగా కనుపిస్తున్నావు" అంటూ మూర్తి భుజంమీద తల వాల్చాడు. మూర్తి ఏదో చెప్పబోతుండగా- "నాయనా! కాస్సేపు మాట్లాడకు- ఈ పొంగు తీరనీ- నేనే మాట్లాడుతా- ఇల్లు తెలిసే ఉంది- కాస్త ఉండు" అన్నాడు. ఇట్లా ఇద్దరూ 10 నిమిషాలు నిద్రిస్తున్న వాళ్ళకు వలె కూర్చుండి స్వప్నశరీరాలతో బొందెల్లోంచి లేచి పోయారు.

II

ఆ పూపొదల్లో పిచ్చికలు రొద ప్రారంభించినై. కాలచక్రంలాగా ఏదో జరజరా దొర్లిపోవటం చూచి నై కాబోలు.

మూర్తి కళ్ళుతెరచి చూచాడు. భుజంమీదనుంచి తల ఎత్తుతూ ఆ క్రొత్తాతడు కళ్ళ నీళ్ళ గోళ్ళతో విదులుస్తూ ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. మూర్తి అతని కళ్ళలో చూచాడు - "అగు! నన్ను తొందరపెట్టకు! నా భాగ్యదేవతవే కాకపోతే నన్ను ఇట్లా ఇతరులు లాలించగలరా? కాకపోతే నువ్వు అవహించైనా ఉండవచ్చు. లేకపోతే ఇన్నాళ్ళ ముచ్చటలు ఈ క్షణంలో అనుభూతం కాగలవా?" అంటూ ప్రారంభించాడు.

మూర్తి "బాబూ! తొందరలేదు, నెమ్మదిగానే చెప్పమన్నాడు."

"చెబుతున్నా- విను నాయనా- నేనూ తెలుగువాడినే. మాట యాసగా ఉందని సందేహిస్తున్నావేమో! -మా తాతలు గోదావరి వాస్తవ్యులు. సంసారాలు చితికిపోయి జరుగుబాటుకే హానిహానిరై రంగూన్ చేరి అచట జీవించారుట. వారితో పాటు మా మేనమామ తండ్రులు కూడా కల్సి ఏదో వ్యాపారంచేసి బాగా డబ్బు గడించారు. అప్పట్లో మా వాళ్ళ ఒరిస్సా వర్తకులతో వ్యాపారం జరిగి బాగా ధనార్జన చేశారు.

మా తాత ఆర్జించింది మా తండ్రి వేశ్యాలోలుడై కొంత చరస్థిరాస్తుల్ని క్షీణింపచేసాడు, కొంత చిట్టెడు గింజలైనా రాని సముద్రతీరపు ఊసరక్షేత్రాగ్రహారానికి పెట్టాడు. మా తల్లి అనసూయాదేవిట. ఎప్పుడూ మా నాయన మాటకు ఎదురాడక ఆయన ఏది చేసినా పరమపవిత్రంగా ఎంచుకుని పది సంవత్సరాలు కాపురంచేసి నన్ను కని పరమపదమును బొంది ధన్యురాలయిందట. నాయనా! అట్టి తల్లి స్తన్యమైనా త్రాగ నోచుకొనలే దీ దౌర్భాగ్యుడు.

మరల మా తండ్రి యింకొక వివాహము చేసికొనెనట. పోనీ అట్టి తండ్రి అయినా పదికాలములపాటుండి తల్లిలేని నన్ను కడుపులో పెట్టికొని ఉండకూడదూ! కాను ఎందుకు ఉండును. ఆయనగూడ నా ఆరవ ఏట గ్రామాంతరముపోయి మరణించెను. తల్లి దండ్రులను చిన్నపుడే చంపుకున్న నేనెట్లు బ్రతికితినో! కష్టజీవిని "అమ్మా!" అని పిలుచుకో లేని నా నోరు మూగైనా! అయిందికాదు మా అమ్మ ఉంటే నాకీ కష్టాలెందుకు వస్తై. అన్నీ సక్రమంగానే నడచేవి అంటూ కన్నీళ్లు పెట్టుకున్నాడు.

III

మూర్తి అతనిభుజంమీద చెయివేసి, "బాబూ! విచారంవల్ల ప్రయోజనంలేదు. ధీరుడు లాగా జీవితాన్ని నడుపుకోవా లంటానుగా" అన్నాడు.

"నాయనా! చిన్నవాడవైనా బుద్ధిమంతుడవే. వాస్తవంగా ధీరత్వంగా నడుపుకోదగినదే జీవితమే కాను, కానీ ఏంచేస్తాను. మా మేనమామల యింట్లో పెరిగి ఒదిగి అత్తలకు అణిగి మణిగి బ్రతికిన నేను ధీరుణ్ణిగా ఎట్లు కాగలను. భీరుణ్ణే అయిపోయినా.

మా మామలు ఒరిస్సా వ్యాపారస్థులకు పెట్టిన అప్పుల క్రింద వారి ఆస్తులు కట్టుకోటం చేతనూ ఇంకా రంగూనులో గలిగిన యితర నాడావిళ్ళచేతను ఓఢ్రదేశం చేరి పూరీ వాస్తవ్యులయ్యారు. వారితో పాటు నేనూ ఉన్నా. నాతో నా పిత్రియమైన కొంత ధనం కూడా మా మేనమామలలో ఉంది. మా మేనమామలు చాల ఉదారులు. మా పెద్దమామ ముఖంలో మా అమ్మగారి పోలిక లున్నవని వినటంచేత ఆయనంటే నాకు ప్రేమ మెండు. భక్తి గూడానూ. ఆయన్ని చూచినప్పుడల్లా మా అమ్మని జ్ఞాపకం చేసుకునే వాడిని. ఆయనకు నా మీద పుత్రవాత్సల్య మెందుకుంటుంది?, ఆయనకు నలుగురు కొడుకులూ ఇద్దరు కూతుళ్ళూ ఉండే. ఆపిల్లలేమన్నా చిలిపిపనులు చేస్తే వాళ్ళకంటే పెద్దవాడిని అవటం చేత మా అత్త నన్ను కసురుతూ నువ్వుండే చేయించావనేది. మా మామ మాత్రం కసిరేవాడు కాదు. పిల్ల

లని మా మామ కొడితే "చూడవే అమ్మా మానాన్న కొట్టాడని" తల్లితో చెప్పుకునేవాళ్లు. మా అత్త కోపపడితే నే చెప్పుకునేందుకు మా అమ్మ ఏదీ? మామయ్య ముఖం చూచుకొని కొట్టుగదిలోకి వెళ్ళి కాసేపు ఏడిచి వచ్చేవాడిని.

మా మామ నా ధనంతో కొంతమంది పెట్టుబడిదారులతో కలిసి కలపవర్తకం ప్రారంభించాడు. ధనము నాదైనా భాగం ఆయన పేరునే నడిచింది. మా మామ కొట్టుపనుల్లో తిప్పేవాడు. మా అత్త వాళ్ళు ఇంటి పనుల్లో వినియోగించేవాళ్ళు. ఇంక నాకేం చదువు వస్తుందీ? చదువుకోమని చెప్పేందుకు నాన్న ఉన్నాడు గనుకనా? వెనకేసుకునేందుకు అమ్మ ఉంది గనుకనా! ఎట్లాగో కొంత ఇంగ్లీషు తెలుగు ఒరియా చదువుకున్నా. అబ్బ లేనిబిడ్డ అందరికీ తేలికేగా! అందరూ "ఆ!" అనేవాళ్ళవటంచేత అడకువగా బ్రతకటం అలవాటయింది.

మామ నన్ను చదువు మానేయించి వ్యాపారంలో దింపాడు. అర్జంటుపనులొస్తే అడవిలోకికూడా పంపేవాడు. మా వాటాదారులంతా "భయభక్తులుగల తెలివైన కుర్రవాడని" అంటూ ఉండేవాళ్ళు. వ్యాపారం బాగా జరుగుతోంది. మా సంసారం పేరుప్రతిష్ఠల్లోకి వస్తోంది. ప్రతిష్ఠతో పాటు మాయధారి మిత్తి పరుగెత్తుకు వస్తోందని మాకేం తెలుసూ! కుర్చీలో కూర్చుని ఉత్తరం చదువుకుంటున్న మామయ్యగుండె ఆగిపోయి చనిపోతాడని మే మేమన్నా అనుకున్నామా? అంతా క్షణాల్లో నడచిపోయింది. ఇది యిట్లాగని చెప్పటానికి కూడ నోరు పలక్కపోయింది. క్షణాలమీద మా మామని ఎగరేసుకు పోయింది. చూస్తూఉండగా సంవత్సరం గడిచింది.

## IV

సంసారభారమంతా మా రెండో మామయ్యమీద పడింది. ఆ సంవత్సరంలోనే అతడు అన్నకూతురు వివాహం చేసి కన్యాదానఫలం పొందాలనుకున్నాడు గాబోలు. కాకపోయినా ఆ పిల్ల ఈడేరే వయసులోకూడా ఉంది. ఆ కానిదేశంలో మంచి అనువయిందీ సాంప్రదాయశుద్ధమయిన సంబంధం తేగలదూ? అప్పటికీ విచారిస్తే మాకు మళ్లీ వచ్చి స్థిరపడిన రెండు కుటుంబాలవారు తేలారుగానీ మా పేరునా విని ఎక్కువ కట్నాలు అడిగారు. మా మేనమామ చనిపోవటంచేతనూ, సంసారం ఇబ్బందులలో ఉండటంచేతనూ, ఆ సంబంధాలకు తూగలేకపోయాడు. కార్యభారమంతా ఆయనమీద ఉండటం చేతను, అంతకంటె వేరే మగదక్షత లేకపోవటంచేతను, అతను కూడా బుద్ధిమంతు డవటంచేతనూ ఆయన్ని ఎవరూ కాదన లేక పోయారు.

అటువంటప్పుడు నేనొక లెఖ్ఖా? ఆ పిల్లని నాకిచ్చి చేస్తానని ఎవరితోనో అన్నాడు. ఆ మాట మా అత్త చెవిని బడింది గాబోలు, ఏదో కల్పించుకొని పెద్ద గోలచేసింది. మా చిట్టికూడా ఏడుపు ప్రారంభించింది. నాతో మాట్లాడటం మానేసింది. నాకు అంతో యింతో ఉపపత్తి ఉన్నా, తోడూ నీడా లేనివాడిని గాదూ! మా అత్త నా మాటంటే చీదరించుకొని కసిరికొట్టేది. తరువాత దాని కారణంకూడా గ్రహింపయింది. ఏంచేయగలం? మా మామ అంటే ఉభయులకూ భయమే అయిపోయింది. అతను రాకపూర్వము ఎంతగందరగోళం చేసినా వచ్చేటప్పటికి కిక్కురుమనకుండా ఉంటారు.

ఒకసారి మా చిట్టిని నేనెందుకో పలకరిస్తే – "పోరా విశ్వి! నా దుంపతెంచటానికి వచ్చావ్. మా నాన్నతో పాటు నేను పోనన్నా పోయానుగాదు. ఇక నాతో మాట్లాడకంది. ఇల్లా అంటని నేనెవరితో చెప్పుకోనూ! తల్లా! తోడా! మా మామ లోకులకు నచ్చేటట్టుగా తమ ఉదారగుణం బయటికి వచ్చేటట్టుగా నాకా పిల్లను కట్టిపెట్టి తన నెత్తిమీది భారం దింపుకోవాలని చూచాడేగాని మా యిద్దరిమధ్యా నున్న అలసతను చూడడు.

అట్లా నిర్లక్ష్యంగా ఉండే సంబంధంమీద నాకు మాత్రం ప్రేమంత మక్కువ ఉంటుందీ? కన్నవాళ్ళు లేని ఏకాకినేగానీ, ఇంతో అంతో చదువూ తెలివి తేటలూ ఉన్నై. కాస్తో కూస్తో ఫరవాలేదు, తినటానికి ఉంది. ఆ పిల్లకంటె రూపవతిని మావాళ్ళే అంటారు. అటువంటప్పుడు నాకీ మామ కూతురక్కరలేదు. ఇంకో సంబంధం చేసుకుంటాననే అహంభావం నాకెందుకుండదూ! ఉందికానీ ఎట్లా నెగ్గుతుందీ! ఒకసారి మాచిట్టి మాఅత్తతో మాట్లాడుతూ నన్ను ఉద్దేశించే ననుకుంటా – "అమ్మా! నాకసలే వద్దే! పురిటిలోనే పిసికేస్తే నీకీబాధ ఉండేదికాదుగా" అంటూ ఏడిచింది. మాఅమ్మ ఉంటే ఇంత సంకటం

వచ్చేది గాదుకదా అని పుట్టెడు దుఃఖమొచ్చింది నాకు. అది ఎట్లాగో అణచిపెట్టుకుని రాత్రి మామయ్య భోజనంచేసి మేడమీదికి వెళ్ళుతుంటే ఆయనవెంటవెళ్ళి భయంతో "మామయ్యా! నాకీసంబంధ మక్కరలే"దని ఊరుకున్నా. ఆయన వెంటనే ఏకాయకీని పై అంతస్తుకు తీసుకెళ్ళి పక్కన కూర్చోపెట్టుకుని— "ఎందుచేతరా!" అని అడిగాడు—"అత్తయ్యా వాళ్లకే యిష్టం లేదుగాబట్టి" అని నెమ్మదిగా అన్నా. జరిగిందేమిటో చెప్పరా! అన్నాడు. తల్లీ కూతుళ్ళకు నాయందుగల శ్రద్ధాగౌరవాలు తెలిసినంతవరకూ చెప్పా—నాయనా! అంతకన్న ఏం చెయ్యను— ఆయన విని విని ఏదో చెప్పి చివరకు—

"ఒరే! విశ్వీ! అదీ చిన్నపిల్ల, నువ్వూ చిన్నవాడవు దాని బుద్ధి ఎప్పుడూ అట్లా ఉంటుందనగలవా! అయితే కొంచెం పెంకెమాత్రం నిజమే. అది మాత్రం నిలిచి ఉంటుందా! ఒక్కచోట పుట్టి పెరిగారు. కాబట్టి చిన్నతనపు అలుసు ఉండవచ్చు. ఇద్దరూ కలిసి సంసారం చేసుకుంటుంటే ఇట్లాగే ఉంటారనుకుంటున్నావా! ఇక వాళ్ళమ్మతో నీకెందుకు? మేమంతా పెద్దవాళ్ళము లేమూ నోరుమూయించటానికి? నువ్వేమీ విచారపడకు. ఇక నా ఉద్దేశం విను. ఆపిల్లను ఇంకొకళ్ళకియ్యటానికి నాకిష్టంలేదు. వాళ్ళు ఏం కోరంటకంపెట్టి ఏడిపిస్తారో నని నాభయం. చూచాయగా మన సుబ్బాలు సంసారం. అసలే పెద్దమామకు ఈపిల్లమీద ప్రేమ. ఇది పుట్టిన తరువాత సంసారం వృద్ధిలోకి వచ్చిందనే అభిమానంతో 4 ఎకరాలు కూడా వ్రాసియిచ్చాడు కూడాను. అట్టిదాన్ని ఎక్కడో ఎరగనిచోట ఇచ్చి ఏదైనా కష్టం కలుగచేస్తే అన్నబిడ్డమీద అతనికేమంత అభిమానముంటుందీ అని నన్నంటారేమోనని భయంపడుతున్నా. – మీయిద్దరికీ చేస్తే మీ మధ్య ఏ పొరపాటులు వచ్చినా మీ యిద్దరినీ చెరో నాలుగూ అని సర్దుబాటు చేయవచ్చును. అందుచేత వేరేమాట మాట్లాడక నన్ను చూచి ఈ సంబంధం చేసుకో, నీ కేమీ చేదుమేపటల్లా. అమ్మ చచ్చిపోయినప్పటినుంచీ మామలు పెంచారని కృతజ్ఞత ఉంటే, కష్టమో నిష్ఠురమో నా మాటవిని నన్ను ధన్యుడిని చేస్తావనుకుంటున్నా. ఇంతకంటె వేరే చెప్పేది లేదంటూ చరచరా దిగివెళ్లాడు. అసలే మామ అంటే నాకు భయం. మా అమ్మ ఉందికనుకనా మా మామని రెండు కూకలేసి కాదూ కూడదనటానికి.

మరుసటిరోజు మధ్యాహ్నం భోజనాలయిన తరువాత మా మామ ఏదో ధోరణి ప్రారంభించి అదీ యిదీ కదిల్చి మా పెద్ద అత్తను గడుసుగా మందలిస్తూ "మనం ఇరకాటాన పడకుండా – నలుగురూ మెచ్చేటట్టు మన పిల్ల మన ఎదుట ఉండి సుఖపడాలనే తలంపుతో ఉన్నానే గాని ఎవడికో ఒకడికి అంటకట్టి బాధ్యత వదల్చుకుందామని తలచటల్లా. అట్లా మీరు అనుకునేట్టయితే మీ యిష్టం వచ్చినట్లు మీరు చేసుకోవచ్చు. ఈ ప్రమేయం నాకేం లేదు. వదులుకుంటున్నా" అన్నాడు.

మా అత్త నెమరు తిప్పుకొని "ఎందుకయ్యా! ఎవరేమన్నారనీ, యింత రాంగామా! నీ కంటె నా కెక్కువ బాధ్యతఉంది గనుకనా! నువ్వు మాత్రం ఏం తప్పు చెపుతావు– అదీ బాగానే ఉంది" అంది. ఎంతవరకు హృదయపూర్వకంగా అందో ఆయనకు మాత్రమేం తెలుస్తుంది?

మా ఉభయుల్ని పులీ మేకనూ ఒక గాట కట్టేసినట్టు చెయ్యాలని నిశ్చయించాడు మా మేనమామ. "సరే, పోనీ యిదీ బాగానే ఉంది, మనపిల్ల బయటికిపోకుండా యింట్లోనే ఉంటుంది. ఇట్లా అణిగి మణిగి ఉండే అల్లుడు మాత్రం దొరుకుతాడా!" అని మా అత్తావాళ్లు అనుకుని ఉంటారు. మొదటి నుంచీ నన్ను చిన్నచూపుతో చూచిన ఈ అత్త నన్ను ఇప్పుడు గౌరవించవచ్చిందా? దానిని బట్టి మా చిట్టిమాత్రం నాకు నచ్చిన సంసారం చెయ్యవచ్చిందా! ఇది కేవలం వెళ్ళపించుకొని వప్తాన్వకంగా మారుతుందని అప్పుడే అనుకున్నా. నాయనా! ఓపికతో ఇంతవరకు వింటున్నావు. నిన్ను కష్టపెట్టాలని లేకపోయినా తప్పక వస్తోంది హృదయవేదన. ఈ సముద్ర తరంగాల్లాగా ఒకదాని వెంట ఒకటి పరుగెత్తుక వచ్చి బయటపడుతున్నాయి. ఏమైతేనేం? ఒక ముహూర్తాన మా యిద్దరికీ పాణిగ్రహణం జరిగింది. ఆలగ్నమే నా కష్టజీవితానికి నాంది ముఖం కూడా అయింది.

## V

త్వరలో గర్భాధానం కూడా జరిగింది. ఇక సంసారం ప్రారంభమయింది. అట్టి దుఃఖమయసంసారాన్ని చెప్పుకుని చింత పడకుండా దాటుతా. నన్ను చూచి మా చిట్టి ఏమీ లక్ష్యపెట్టేదికాదు. మంచంమీద పడుకుని లేవనైనా లేచేదికాదు. మా అత్త నన్నో నౌకరు

పిల్లకాయలాగా చూచేది. ఎవరైనా "చిట్టీ! మగడి ఎదుటనేనా అంతనిర్లక్ష్యం" అంటే వెంటనే మా అత్త అందుకుని "ఊరుకుందురూ! పసిపిల్ల. నిన్నటివరకూ ఒక కంచంలో తిని ఒక మంచంలో పండినవాళ్ళకు ఇప్పుడే మర్యాదలు తెలుస్తాయిషా"? అని వెటకారం చేసేది. నేనెప్పుడైనా "చిట్టీ! ఇదేదీ, అదేదీ అని అడిగితే వెంటనే అత్త అందుకుని "ఏమిటయ్యా సీమ నుంచి యిప్పుడే వచ్చిన వాడిలాగా అడుగుతావు. ఆ వెక్కడ నుంటయ్యో బొత్తిగా ఎరగకుండానే ఉన్నావా ఏమిటీ" అనేది. నా భార్య నాకంటె ముందు భోజనంచేసి ఎక్కడో పడుకునేది. నేపోయి ఏదైనా కావలెనని లేపబోతే ఆపిల్ల చిరచిరలాడేది. మా అత్త సన్నగా "నీకు అదిగాని కనపడలేదా! మమ్మల్ని అడగకూడదా? పెత్తానికి అల్లుడుతనం చూపుతున్నావులే" అనేది. చివరికి పెళ్ళిచేసుకున్న పాపానికి ఒకమాట అనడానికీ గానీ అనకుండా ఉండటానికి గాని వీలులేకుండా పోయింది. ఇట్లా 3-4 సంవత్సరాలు గడిచింది. చివరికి మా మామయ్య ఏమీ సౌఖ్యం కలుగ చేసుకోలేక నన్నే నాలుగు తననో నాలుగు ఇంట్లో వాళ్ళనో నాలుగు తిట్టి చక్కాపోవటం సాగించాడు.

ఇట్లా సంసారం నడుపుకోటం కష్టమనితోచి ఒక రోజున తెగించి మా మామని "నా డబ్బుతో ఒక యిల్లు కొనిపెడితే ఆ యింట్లో ఉండి నా కాపురం నేను చేసుకుంటానన్నా. మామయ్య "సరే ఆలోచిస్తానులే" అన్నాడు. మా అత్త పెద్దనోరుపెట్టుకుని "చాల్లేఊరుకో? ఏమాత్రం సంపాదిస్తున్నావని వేరేకాపురం పెట్టాలని; ఇద్దరు పుడితే తెలుస్తుంది. ఇంకోయిల్లెందుకూ ఆ తెచ్చేదేమిటో పెట్టుకుని ఈ యింట్లోనే ఒకమూల ఉడకేసుకు తినండి - మాకెందుకు వచ్చింది" అంది.

నాకొకరోజున కోపమువచ్చి కూతుర్ని ఒకలెంపకాయ కొట్టానని తల్లీకూతుళ్ళు పస్తుపడుకున్నారు. చివరకు కక్కాలేని ఉమియాలేని సంసారమయ్యింది. వయసులో ఉండి ఎంతోహాయిగా గడపవలసిన నా జీవితం ఎంత వ్యధచెందిందో భగవానుడికి ఎరుక. మా అమ్మ ఉంటే మా అత్తని అట్లా ఆడనిచ్చేదా? కోడల్ని అట్లా కమక నిచ్చేదా?

నాకు ఏదేదో ఊహలు - మా అమ్మ ఉంటే-చక్కటి భార్య - బాగాచదువుతున్నదీ - చలాకీగా ఉండేదీ - మంచి సమర్థురాలయిందీ - సంసారం దిద్దుకోటంలో బహునేర్పరి - ధార్మికురాలూ - ధనికురాలూ - నన్నే ఎప్పుడూ ప్రియత్వంగా చూచుకునే భార్య వచ్చేదని. ఆవిడ లేకపోవటంచేత ఇట్లా కలిగిందనుకునేవాడిని, రానురాను సంసారమంటే అసహ్యమనిపించిందని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

మూర్తి అతనిని ఓదారుస్తూ "విచారపడకండి, కష్టాలు కాపురాలు చేస్తూకూర్చుంటయ్యా!" అన్నాడు మూర్తి. ఆ మాట అనగానే అతను మూర్తి గడ్డం పట్టుకుని, "నాయనా! ఆదేజరిగింది. నువ్వుచూస్తే నాదివ్యమూర్తిలాగ ఓదారుస్తున్నావు. ఆ! అదిగూడా చెప్పతున్నా నా జీవితంలోని ఈ రంగాన్నికూడా విని మరిపోదుగాని" అని కళ్ళుమూసుకుని "అబ్బా! ఏనాటిదో జ్ఞాపకం వస్తోంది - ఎంతని చెప్పను ... సరే."

## VI

మా గంజాం ఫరం మేనేజరు జబ్బుపడటం-మావాటాదారులు నన్నక్కడికి వెళ్ళమనటం, తటస్థించింది. నేను వెళ్ళటానికి సిద్ధము అయినా; మా మామ బలవంతం మీదనే ఒప్పుకున్నాడు. నేను వెళ్లకుండా ఉన్నా ఇంతటితో నా కథ ముగిసేదేమో?

నేను గంజాంవెళ్ళిన రెండుమాసాలకు హోటల్ భోజనం సరిపడక జబ్బుచేసింది. మామయ్య వెంటనే చిట్టిని నాదగ్గరకు పంపాడు. అది వచ్చిన మొదట్లో ఏపదిరోజులు సుఖముగా వండిపెట్టిందో కాని తరువాత తరువాత తనకు గుండెల్లో దడా-అరికాళ్ళుమంటలూ అంటూప్రారంభించింది. ఏదో వైద్యాలు చేయిస్తున్నా. ఒకరోజు మధ్యాహ్నం "నా కిక్కడ నీళ్ళు పడటంలేదు. మా అమ్మని చూడాలి, నే వెడతా నంటూ మూరాముళ్ళుపెట్టి రాత్రి బండిలో వెళ్ళిపోయింది. అది వచ్చింది కదా, నాకు సుస్తీ తగ్గిపోతుందని సంతోషిస్తున్న నాకు విచారం కలిగించింది. నాకు దానియందు అసహ్యం కలిగింది. దానికి నామీద అంతేనేమో! కాకపోతే ఏ ఎండుతోనో పండుతోనో నాతోనే లోకంగా ఉండాలిసిందేగా. హోటల్ మానేసి వంటమనిషి దొరకక నేనే స్వయముగా వంటచేసుకోటం ప్రారంభించా. చేసుకోటం బద్ధకమైతే ఏవో పళ్ళో పాడో తిని గడుపుకోటం నేర్చుకున్నా. "ఈనాటి నా స్థిమితం ఆనాటి దాని భిక్ష." ఎప్పుడు సాయంకాలపువూట ఫరంకు వెళ్ళి

రెండుగంటలసేపు లెక్క చూసుకు వచ్చేవాడిని. ఒక క్లబ్బుకు పోవటం గాని – అల్లరి చిల్లరివేషాలు గానీ – ఏమీ లేవు – చిన్నప్పటినుంచి అట్టి సాంగత్యం ఎరిగి ఉంటేగా!

ఆరు సంవత్సరాలు కాపురంచేసినా సంసార మంటే ఈప్సితా తగ్గింది కాదు. పోనీ కమ్మటిసంసారం అనుభూతమై కథా ముగిసిందీ కాదు. కోరికలన్నీ కుదించుకు పోయి నా మనసు మంచి బిగింపుమీద ఉండి ముట్టుకుంటే పేలిపోయే నేలటపాకాయి మాదిరిగా బిగిసి ఉన్నట్టు నాకే భయం వేసింది.

ఎప్పుడూ ముచ్చటైన దాంపత్యాన్ని చిత్రించుకుంటూ నా మనసు కలలు కంటూ ఉండేది. —"ఛీ! ఈ జన్మకు ఇంకేం సౌఖ్యం, వట్టి పిచ్చిభ్రమపడుతున్నా"నని విరాగం పొందేది. ఏ చిన్నపిల్లయినా సరే చివరికి– "అన్నా" అంటూ ఇంట్లో తిరిగితేనైనా చాలు అనిపించింది. ఏదో గందరగోళం పడేది. ఇక పురాణాలు సుఖసంసారపువిశేషాలు ఏకవీరలాంటి రచనలూ చదివి సంతోషపడేది. నా మనసు ఇంత బెంగపడేటప్పుడు మా చిట్టికి తన తల్లిమీదనున్న ప్రియత్వంలో పాతికవంతైనా నామీద ఉంచగూడదా? అనుకునేవాడిని. మా అత్తకు స్త్రీకి సహజమైన సంసారపు గోడుకంటె వ్యవహారపు సంత మెండు.

పప్పులో ఉప్పెంత వెయ్యాలో తెలియదు గాని పదిడబ్బులు ఎట్లా పోగుచెయ్యాలో తెలుసు. ఆకూతురు గూడా ఆపాఠమే నేర్చుకుంటుంది కాబోలు. నాకు డబ్బుమీద కాంక్ష తక్కువేగాని చిన్నప్పటినుంచీ నన్ను—"నా" అనేవాళ్లు లేకపోవటంచేత మమత్వం కోసం మ్రగ్గిపోయి చివరకు అట్టి భార్యకు కూడా కరువై నాకు నేనే బరువైపోయినా— ఇక దానిసంగతి వద్దు, మరచి పోతున్నా.

## VII

మాయింటికి కొంతదూరంలో మా గోదావరివాళ్లే ఉన్నారు. ఆయింటాయన బహు నెమ్మదయినవాడూ పెద్దవాడూను. అప్పుడప్పుడు దోవలో అగుపించి నా క్షేమసమాచారాలు తెలుసుకుంటూ నాయందు గౌరవము చూపిస్తూ ఉండేవాడు.

ఒకరోజు నా నౌకరు నావేయిపడగల పుస్తకం బల్లమీద పెడుతూ "అయ్యగారూ! ఆలలితమ్మగారు మన అమ్మగారిదగ్గర ఈ పుస్తకం తీసుకున్నారట. అమ్మగారు ఊరికి వెళ్ళేటప్పటికి పూర్తిగా చదవటం కాకపోవడంచేత ఈపదిరోజులూ అట్టిపెట్టుకున్నానని చెప్పి యిచ్చారండీ" అన్నాడు. ఆ లలితమ్మగారు ఎవరా అని విచారిస్తే మన యింటిఎదుటి తెనుగు ముసలాయన కోడలని చెప్పాడు. మీరు ఆఫీసుకు వెళ్ళినపుడు మనయింటికివచ్చి అమ్మగారితో పలుకాడి పోయేవారని చెప్పాడు. ఆ పుస్తకం అంతశ్రద్ధగా తీసుకువెళ్ళి చదివినందుకు మా చిట్టికంటె చాల నయమని సంతోషించా.

మరొకరోజు ఫరంనుంచి యింటికొస్తుండగా దోవలో ఆముసలాయన ఎదురై ఏవో కష్టసుఖాలు చెప్పుకుంటూ వచ్చి తమకూ ఇన్సూరెన్సు కంపెనీవారికీ కలిగిన దావా కాగితం చూచిపెట్టమని యింటికి తీసుకెళ్ళాడు. ఆవ్యవహారంలో ఆయనకు నచ్చిన సలహా చెప్పినందుకు సంతోషించాడు. తలుపు చాటునుంచి ఆ లలితమ్మ నెమ్మదిగా "అక్కగారు యెప్పుడు వస్తారు? — నేను పంపిన పుస్తకం అందింది గాదండీ" అంది. ఆ కలుపుగోలుతనపు మాటలు చక్కగా మృదువుగా వినిపించినై. కాస్సేపు ఆగి "ఇక వెళ్ళి వంటచేసుకోవా లని" లేచా. "అదేమిటీ" అన్నాడు ముసలాయన. "హోటల్ భోజనం పడకనే ఈ ఏర్పాటు లెండి" అని ఇంటికి వచ్చా.

మరునాటిరోజు ప్రొద్దున ఆముసలాయన యింటికి వచ్చి ఏదో మాట్లాడి తక్కిన రికార్డంతా చూచి పెట్టమని తమయింటికి తీసుకు వెళ్ళాడు. వ్యవహారమంతా అయి లేచిరాబోతుండగా ఆలలితమ్మగారు గుమ్మముదగ్గిర నీళ్లు పెట్టి "లెండి, భోంచేతురుగాని. యిప్పుడు వెళ్ళి ఏం వంట చేసుకుంటారు గనుక? మా మూలాన ప్రొద్దు పోయింది గనుక మా యింట్లో భోంచేసి వెళ్ళా"లంది. నేనసలే పుట్టెడు సిగ్గున్న మనిషిని. నేను "కాదూకూడ"దన్నా. ఆ ముసలాయనా ఇంకో ముసలమ్మా పట్టు పట్టేసరికి కాని వల్లకాదన్నారు. గత్యంతరం లేక మడిగట్టుకుని వెళ్ళి కూర్చున్నా. విస్తర్లు వేసి ఆయన కోడలు వడ్డన ప్రారంభించింది. క్రిందటిరోజు ఆ ముసలాయన మాట్లాడుతూ తన కుమారుడు చనిపోవటం కోడలికి దత్తత చేసిన విషయం చెప్పాడు గాని లలితమ్మ యింత చిన్నదని మాత్రం నేను ఊహించలా; ఆ అమ్మాయికి పాతికేళ్ళుఉంటై, అప్పటికే నాకొడుకుపోయి 8 సంవత్సరాలయిందని చెప్పాడా ముసలాయన. అంటే ఆ

పిల్లకు 16–17 ఏళ్ళకే వైధవ్యం ప్రాప్తించిందా పాపం అని విచారం కలిగింది. చిన్నతనంలోనే వైధవ్యం రావటంచేత గాజులు బొట్టు తియ్యలేదు. ఆముఖవర్చస్సు బ్రహ్మచర్యపు దీక్షను ప్రకటిస్తోంది. నాకు ఆమెయొక్క దుస్థితి చూచి మనసు కరిగి దీనంగా రెండు మూరులు ఆమె ముఖం చూచినట్టు గుర్తు. భాగ్యసౌఖ్య మెరుగని నేనెంత దురదృష్టుడనో, భర్తప్రేమ ఎరుగని ఈ పిల్ల అంత దురదృష్టురాలనిపించింది. పైగా ఇద్దరంకూడా ఒకేవయస్సులో నున్నట్లు కనుపించింది. ఇద్దరం ఏ చెడు నక్షత్రంలోనో పుట్టామేమో ననిపించింది. భోంచేస్తున్నానేగాని ఇదే ఆలోచన. ఆ ముసలాయనతో మాటల మధ్య "ఈ అమ్మాయేంగా మీ కోడలు" అని అడిగా. పాపం ఆ మాటకు ఆ పిల్ల సిగ్గుపడింది కాబోలు, తన ముసలి మేనత్తను వడ్డనకు పంపింది. ఏవో రెండు మెతుకులు తిని లేచి వచ్చేశా.

మంచి తెలివితేటలు గల పిల్లలాగా కనుపించింది. నన్నామె నిష్కపటుణ్ణిగాను అమాయకుడిని గాను గుర్తించి, ఇంతకు క్రితమే మా భార్యాభర్తల సయోధ్యను గమనించిందో ఉన్నది గాబోలు, ఎదో మాట్లాడుతూ "దేనికని విచారించగలం? తలొకరికీ తలో ప్రారబ్ధం" అన్నది. ఆ మాట నాకు నచ్చింది. అవును, దుష్టమార్గాలను తొక్కిచూడని నా మనసు ఆమెను దుష్టమైన కళ్ళతో చూడటంగానీ— వాక్కులు మెదల్పటంగానీ బుద్ధులు ఊహించటంగానీ ఎట్లా చేయగలదూ. నాదంతా అమాయకత్వ నడకగా తలంచి గాబోలు, ఆ లలిత చలిత కూడా అయిందట.

తన పెంపుడు కొడుకును నా దగ్గరకు ఇంగ్లీషు చదువుకు పంపింది. ఆ కుర్రవాడిని ఆ ముసలాయన స్వయంగా తీసుకొచ్చి తీసుకెళ్లేవాడు. నేను వాళ్ళ కుటుంబానికి అనుబంధీకుడుగా నుంటూ ఉండటంచేత భోజనభాజనాల్లో పరాయితనమే లేకుండా పోయింది. రోజులో ఒక మార్తైనా నన్ను వారూ, వారిని నేనూ చూడకుండా తప్పేది కాదు. అట్లా మా మధ్య ఒక అవ్యక్తమైన అనుబంధ మేర్పడింది. చివరచివరకు లలితమ్మతో నేను గానీ— నాతో లలితమ్మ గానీ మామగారు ఉన్నప్పుడుగానీ— లేనప్పుడు గానీ స్వేచ్ఛగా మాట్లాడుకో వచ్చు ననే విశ్వాసం మాలో నిలిచింది.

## VIII

—"నాయనా! అంతటితో ఆ వనువు అగినచో నా హృదయము లేయిబారిఅకుంపవలె భిన్నభిన్నములు కాక యుండెడిది గదా! నిరాశ్రయమై ఆధారముకొరకు క్రింద పాకులాడెడు లతకు పసి ఆవిసి మొక్క అందినట్లయినది. దానికేమి తీవలు ఉంటేనా భారమాపుకోనుటకు.

ఒకనాడు పిల్లవానికేదో చెప్పుచుండ లలితమ్మ నా వద్దకు వచ్చి ఒక పెట్టెలోని రాళ్ళ ఉంగరమును తీసి "విశ్వేశ్వరులుగారూ! ఈ ఉంగరం మెట్లున్నదో తెలకట్టుడని నామీద వైచెను, నేను రాతినీ, చేతనూ పరీక్షించి బాగుగనే ఉన్నదని మరల పెట్టెలో పెట్టితిని. అందులకామె నవ్వి, 'దాని బాగోగులు కళ్లకి పెట్టుకుని చెపుతారా! అటూ యిటూ త్రిప్పిచూస్తూ చెపుతారా! నిజంగా మిమ్మల్ని విశ్వేశ్వరు డనేకంటే దా మో ద రు డం టే బా గుం టుం ది,' అంది. నాకు నవ్వొచ్చి "దామోదరుడంటే విశ్వేశ్వరుడు కాదనికాబోలు నీభావం. పైపెచ్చు కృష్ణత్వం కూడా పట్టిచ్చదలుస్తూనూ" అన్నా. "ఏమో కృష్ణత్వం పట్టినాసరే, శ్వేతత్వం పట్టినా సరేగానీ "చిట్టమ్మగారిలో మీలో ఎవరు తీసిపోని రసికులో తేలకుండా ఉంది. — ఏమిటో? పాకులోకంలో కావలసింది కళ్ళముందు ఉంటే కంటిమొక్కకంటే కనాకష్టం — అదే మెట్టమీద ఉంటే మేరుశిఖరంకంటే మహాభారం— ఏమో యిటువంటివి చూడలేకా వినలేకా ఎండిపోయిన మాగుండెలు బీట్లు వారిపోతై" అంటూ లోపలికి వెళ్ళింది. నాపాఠం పూర్తి అయింది. లోపలినుంచి ఒక గ్లాసుతో లలితమ్మ పాలు తీసుకువచ్చి "ఇందాకటిమట్టి నామాటలతో అలసిపోయారేమో! నన్ను క్షమించి ఈ క్షీరాలు పుచ్చుకోండి" అంది. —"నాయనా! ఆమాటలు క్రిందటి క్షణంక్రింద అన్నట్లుగా వినిపిస్తున్నై

## IX

శ్రీజగన్నాథస్వామివారి కల్యాణమహోత్సవాలు జగన్మోహనంగా జరుగుతవని పత్రికలు పంపుతున్నారు. లలితాంబ "రేపు మేము జగన్నాథస్వామివారి కల్యాణమహోత్సవం చూచిరావటానికి ప్రయాణం కడుతున్నాం" అంది. "మళ్ళీ ఎప్పుడూ తిరిగిరావటం" అని నేనడిగేటప్పటికి —"ఏమో ఎప్పుడో వస్తాం" అంటూ విసుక్కుంది. కాస్సేపు నేను ఊరుకొని "అక్కడ స్నానపానాలకు వసతులు సరిగ్గా జరుగుతునా?" అని అడిగా. —"ఏమో కళ్యాణ అయుక్తావదేవాళ్ళ కా వైనాలు కావాలిగాని మాకేం

లాభం? మాకంతకోపేగాని" అంది. నేను నవ్వుతూ నాకళ్ళేమంత పాపిష్టికళ్ళా!—మీకేం! అక్కడెవరో మీకు తెలిసినవారున్నారుట, అన్ని సదుపాయాలు చేయటానికి...నాకెవరున్నారూ!" అన్నా. ఆవిడ నవ్వుకుంటూ "మీకు మేము లేమూ" అంటూ లోపలికి పోయింది. "అబ్బా, ఆమాట నాజీర్ణ సౌధానికి వెయ్యి పాటీల పెట్టయింది. అట్టిమాట వినటానికి కలలు కంటున్న నాహృదయం ఎంతసంతోషంతో ఉబ్బి గంతులు వేసిందో నాయనా! ఇప్పుడంత చితికి దుఃఖంతో గందరగోళం పడుతూ తూలిపోతోంది. నేనాపుకోలేను" అంటూ ఆవురుమన్నాడు.

మూర్తి నెమ్మదిగా "బాబూ ఎప్పుడూ వెన్నెలే ఉంటుందా! తరువాత కానీ..." అన్నాడు "నాయనా! ఔను! ఆ కల్యాణోత్సవాలకు నేను వారితో పండు వెన్నెలలోనే బయలుదేరింది. ఆ ముసలివారిద్దరూ వెనక వస్తుంటే మేమిద్దరం వెన్నెల్లో వినీనకర్రిల్లాగా చిమ్ముకుంటూ పోయినాం. ఒక్క పురాణగాథలే గాదు, ఏవేవో గాథల్లో క్షణంలో స్నేహం చేరాం. ఆ మామగార్కి మాయందు విశ్వాసమిట్టిది."

జగన్నాథస్వామివారి దర్శనానికి వెళ్ళాం. జనం తండోపతండంగా విరగపడుతున్నారు. "ముసలివారిద్దరూ పిల్లవాడిని తీసుకుని జనం పంపిచ్చినప్పుడే వెళ్ళి దర్శనం చేసుకుంటామని బసకు వెళ్ళిపోయారు. నేనిప్పుడే స్వామిదర్శనం చేసితీరాలి....ఎట్లామరీ"అంది లలితమ్మ "నేనున్నాగా; అంతగా కాకపోతే నే నెరిగిన పోలీసాకడు కనుపించాడు, వాడిద్వారానైనా దర్శనంచేసి మరీ వెళదాం లే" అన్నా. "నువ్వుంటావనేగా నేను బయలుదేరింది!-ఒకరికొకరు ఎట్లాఉండకలుగుతాము" అంటూ నా కొంగుపట్టుకుని ఆలయం లోపలికి జనాన్ని ఒత్తుకుంటూ వచ్చింది. "ఈ అమ్మాయి మా చిట్టి కాకూడదూ!" అని నా హృదయనాళాల్లో సన్నని మోతమోగింది. "ఔను నేను మీ చిట్టెమ్మనెందుకు కాగూడదూ!" అని లలితమ్మ సన్నగా అన్నట్లు వినిపించింది. నా గుండెమోత ఆమెకు వినిపించిందేమోనని నాకు సిగ్గు గలిగింది.

ఇట్టే దేవతాదర్శనం చేసి ఉత్తరద్వారాన వచ్చి మంటపంపక్క కూర్చున్నాం. "పాపం నువ్వు ముందుండి జనాన్ని ఒత్తిగించేటప్పటికి నీ జబ్బలన్నీ నలిగి ఉంటై. నేనేం చేయను" అంది. అప్పుడూ వెన్నెలే ఎంతవెన్నెల. అబ్బా యింత చీకటికిముందు వింత వెన్నెలుండదు. "పదండి ఆమంటపంమీద కూర్చుని భజనలుచూద్దా మంటుంది. ఏవో కొసరి కొసరి మాట్లాడబోతుంది. వెన్నెల చాలా యిదిగా ఉందంటుంది. ఒక పొద్దువేళ స్వామి కల్యాణం జరుగుతోంది.అమ్మవారివీ అయ్యవారివీ పరివారలు ఎంతో ఆనందంగా ఉన్నై. వాటిలో విశేషాలు లలితమ్మగారు వినిపిస్తోంది. నాకు తెలియనివిషయాలుకూడ వచ్చినయి. చదువుకున్న స్త్రీఅని ఆమెమీద భక్తికూడా కుదిరింది. ఆ జనసమ్మర్దంలో స్వామికల్యాణమహోత్సవం, ఇద్దరం ఇద్దరమయి చూచామో లేక యిద్దరం ఒకళ్ళమయి చూచామో స్పృహా లేకపోయింది."

కొందరు అల్లరి పిల్లలు ఒక ఆడపిల్లని అల్లరి పట్టించారు, "చూచారా! ఎవరైనా ఆడది కనుపిస్తే తిరణాళ్ళలో ఆదీవరస...వెళ్ళేటప్పుడు సాగ తేమిటో!" అంది. "నేను మీ వెంట ఉండగానే!"అని నేనంటూ ఉండగా "మీరు ఉన్నారనే ఇట్లా వచ్చి కూర్చోగలిగింది. "ఎవరైనా ఆవిడ మీకేమవుతుందని అడిగితే మీరేమని చెపుతారో!"అంటూ ఆవిగో తరంబరాలు పోస్తున్నారు చూడండంది. నేను సందిగ్ధంలో పడ్డా-"అబ్బా! అయిదేదు రోజులే కాదు ఎనిమిది సంవత్సరాలూ అట్లాగే గడచిపోయినై — "ఎన్నని తల్చిపోనుకోనూ.ఏదైనా ఒక పెద్దపెళ్ళ క్రిందపడి యిద్దరం దాగైనా పోయాం కాదు.

కుర్రివాడి కేదైనా పాఠం చెపుతూ ఉంటే "ఏమిటదీ నాకు పెంపుడు కొడుకైనా తమ స్వంత బిడ్డలాగా చూచుకుంటున్నారా! మాటా పలుకూ లేకుండా ఒకటే చదువు. ఈ ఊరొచ్చింతరువాత బడి పంతులుతనం చేద్దామనుకుంటున్నారు గాబోలు" అనేది లలితమ్మ అనోటమ్మట ఏమాట వచ్చినా కమ్మగా ఉండేది.

ఆవిడ చాలా తెలివైన మనిషి. మామగారుకూడా ఆ అమ్మాయి సలహాతోనే అన్ని పనులూ చేస్తూఉంటాడు. డబ్బూ దస్కంతా ఆవిడ చేతులమీదుగానే జరుగుతూ ఉంటుంది. పొలుకు రెండు మూడు నెలలు వచ్చేట్టున్నై.

ఒకరోజున మామగారి ఎదుట లలితమ్మ నాకు ఒక 100 రూపాయల నోటిచ్చి "ఇది మీ క్యాంపులో మా



పరంగా ఉంచండి. అర్జంటుగా కావలిస్తే మేము వాలున తీసుకు వాడుకోవచ్చు. మాదగ్గర ఎంతఉంటే అంత ఖర్చుగానే ఉంది" అని అడిగింది. నేనా నోటు తీసుకోకుండానే 'నాకు బ్యాంకి దాపరికం లేదే! కాక అనింది కొట్టులోంచే తీసుకుంటా. పోనీ కొట్టులో జమచేయిద్దామంటే ఏ ఖాపతుక్రింద జమ చేయిద్దామా అని ఆలోచిస్తూ తర్కించుకుంటున్నా." వెంటనే లలితమ్మ మూతి ముడుచుకుంటూ 'బాబూ! మీరేం బాధపడనక్కరలా! మాడబ్బు మాకు బరువు కాదు లెండి. ఏదో ఫరం మేనేజర్లు కనుక అదనుకు వస్తుందని ఆశతో అడిగాం' అంటూ లోపలికి వెళుతూ 'ఇటువంటి మేనేజరు మేనేజిమెంటు– బలే...వట్టి... ...' అని ఏదో అంటోంది. ఆ లలితమ్మ మామగారు 'పోనీ లెండి, మీకు బ్యాంకి ఎక్కౌంటు ఉండకపోతే ఏం చేస్తాం గనుక' అన్నాడు.

## XI

నేను భోంచేసి ఫరంకు వెళ్ళాలని తలుపు తాళంవేసి యింటికి వచ్చా. జనం రోడ్డుమీద సందడిచేస్తున్నారు. అటుచూతును గదా రోడ్డుప్రక్క యింత అన్నం చెల్లాచెదరై పడిఉంది. ఒక కుక్క తింటూంది. కొద్ది దూరంలో ఒక మట్టికొట్టుకున్న గుడ్డను చేత్తో పుచ్చుకుని 10–12 ఏళ్ళ కుర్రవాడు ఏడుస్తూ నుంచున్నాడు. విషయం తెలియటల్లా. ఇంతలో మా నౌకరువచ్చి 'అయ్యగారూ! ఆ బాపన అబ్బాయిగారు మాదా కబళం పోగుచేసుకుని మనవీధిగుండా ఎడుతుంటే నాయుడుగారి కుక్క ఎంటపడి ఆ కుర్రాయనచేతిలో సంచిని పీలికలుగా చించి కూరలూ, పులుసూ, నేతి పాలుచేసి అన్నం తింటోంది. వణ్ణం కోసం ఇద్దరు తమ్ముళ్ళూ, తల్లీ ఎదురుచూస్తూ ఉంటారట. పాపం! ఆ బుడ్డాయన ఒకటే ఏడుపు' అని చెప్పాడు. నాకు చాలా జాలి కలిగి ఆ కుర్రవాడిని మా నౌకరుచేత పిలిపించి ఏడవకని ఓదారుస్తున్నా. ఆ కుర్రవాడు ఏడుస్తూ 'నా కసలే ఇది ఒకటే గుడ్డ. కుక్క కాస్తా చింపేసింది. అన్నంకోసమని తమ్ముడూ వాళ్లూ చూస్తూఉంటారు. ఇంకా నేను స్కూలుకు కూడా వెళ్లాలని" ఎక్కెక్కి ఏడిచాడు. ఇంతలో ఓ కాళదు 'ఏదైనా యిచ్చి పంపండి పంతులుగారూ' అన్నాడు. వెంటనే ఆ కుర్రవాడిని లోపలికి తీసుకెళ్ళి శుభ్రంగా స్నానం చేయించి నాకు రాత్రికి ఉంచుకున్న అన్నం–కూరా తీసుకు వెళ్ళమన్నా. 'ఎందులో పట్టికెళ్ళను' అన్నాడు. ఎదురుగా ఉన్న ఖద్దరు ఉత్తరీయం ఇచ్చి అందులో కట్టుకువెళ్ళమన్నా. మళ్ళీసాయంకాలం తీసుకువచ్చి యిస్తానన్నాడు, నేను "అక్కరలేదులే" అనేప్పటికి 'అచ్చంగా తీసుకోనా' అని అడిగాడు. నేను "ఓ" అన్నా ఎదో సంతోషంతో. అప్పుడా బుడతడి ముఖంలో కనుపించిన సంతోషం—"అబ్బా– ఇంతదుఃఖానికీ – ఎంతోసుఖానికీ కారణమైంది–"

'ఈకాస్తఅన్నం మీ అందరికీ సరిపోతుందా' అని అడిగితే 'ఇది మా తమ్ముళ్ళకిచ్చి నేను బడికివెళతా' నన్నాడు "నీకెట్లామరి" అంటే 'మా అమ్మఉందిగా' ఆవిడ ఎట్లాగో తెచ్చిపెడుతుందన్నాడు. ఆకుర్రవాడు మా అమ్మ ఉందిగా అనేప్పటికి నాకు మా అమ్మ లేదుగా, యిట్లా కడుపులో పెట్టుకునేందుకు' అని దుఃఖమొచ్చింది. "అబ్బాయీ! ఈ బియ్యంకూడా తీసుకెళ్ళి వండుకుతినం"డని ఇచ్చి పంపా, 'అమ్మతో ఇదంతా చెప్పుకుంటానని ఆకుర్రవాడు వెళ్ళిఉంటాడు– నేను మా అమ్మను స్మరించుకుంటూ ఫరంకు వెళ్ళా. మా యిద్దరినీ పంపి మానౌకరు వాకిట్లో కూర్చున్నాడు. సాయంకాలం లెఖలు తేమలక ఆలస్యంగా యింటికి వచ్చా. అప్పుడు వంటచేసుకోవలసి వచ్చిందని ఇదాతున్నా. పైన మబ్బుపట్టి వర్షంవచ్చేటట్టుగా కూడా ఉంది.

"మాస్టరుగారూ! మాస్టరుగారూ!" అంటూ లలితమ్మగారి కుర్రవాడు వచ్చి, 'మా ముసలమ్మ మిమ్మల్ని వెంటనే వచ్చి ఒకమాట వినిపొమ్మని చెప్పిపంపిందండి' అన్నాడు. అతడి తాత మహాన్యాస్యు చేయించటానికి ఏదో ఊరు వెళ్లాడు. ఒకవేళ ఆయన దగ్గరనుంచి ఏదైనా ఉత్తరంవచ్చిందేమోనని, "మీ తాతదగ్గిరనుంచి ఉత్తరం వచ్చిందా!" అని అడిగా. 'నాకు తెలియదు, మిమ్మల్ని అర్జంటుగా రమ్మనమని మా అమ్మకూడా చెప్పింది అన్నాడు. వెంటనే చొక్కా తొడుక్కుని రెండు నిమిషాల్లో వారియింటికి వెళ్లా.

ఆ ముసలావిడ 'నాయనా! ఇంత పొద్దుపోయిందేం యింటికి వచ్చేప్పటికి – చూచావా! ఆ ముసలాయన వెళ్ళి అతీపతీలేదు – ఉత్తరం కూడాలేదు, అంటూ ఏదో మొదలుపెట్టింది. కొంతసేపు లలితమ్మ కూడా మాట్లాడింది. పొద్దుపోతోంది, నేనింకా వంటచేసుకోవాలి. వీళ్ళకు నాయిబ్బంది ఏం తెలుస్తుందీ అను

కాని "అవ్వగారూ వెళతా! ఇంకా వెళ్ళి భోజనం చెయ్యాలి కూడాను" అని లేచా.

లలితమ్మ "ఇప్పుడు వంట చేసుకునేగాదూ?"అంది. పొద్దుటి గొడవంతా చెప్పాలిసి వస్తుందని "కాదు లెండి......"అంటూ ఉండగా "అబద్ధా లాడైనా ఒక ఆడపిల్లనైనా కొందామనా!"అని నవ్వింది. "సరే లెద్దురూ! ఆవేళప్పటికి సరిలేదూ చేసీలేదు. మరొక మాట మాట్లాడకుండా లేచి యిక్కడ భోజనంచేసి పొండి. ఇవిగో నీళ్ళు, ఇదిగో పట్టుబట్ట"అంది. ముసలమ్మగూడా "లేనాయనా! పొద్దు నెప్పుడో భోం చేసి వెళ్లావు. వెళ్ళేప్పుడు మిగతా అన్నంకూడా ఎవరికో ఇచ్చికూడ వెళ్ళావట?"అంది

లేవక తప్పిందికాదు. లలితమ్మ వడ్డించింది. "ఈ గారెలూ, పాయసాన్న మేమిటీ? అనుకున్నా. లలితమ్మ నవ్వుతూ "పొద్దుటి మీ ధర్మబుద్ధికి సద్యఃఫలితంగా సాయంకాలానికి భగవంతుడు మీకీ ఫలితమిచ్చా"డంది. అట్లాగైతే నాకు భగవంతుడు లలితాంబగారే కాదూ"అన్నా. "ఆ లలితాదేవికి కూడా 'విశ్వేశ్వరుడే'గా దైవం" అంది. ఆ మాటలు ముద్దులొలికినై. "నాధర్మానికి ఇది ఫలమైతే మీ ధర్మానికి ఏంఫలమో!" అన్నా. "నాకా ఈశ్వరుడి దయ చా"అంటూ లోపలికి వెళ్లి రెండు గారెలు తెచ్చి వద్దన్న కొద్దీ వేసింది. — "నాయనా! ఆ రుచేమిటోగాని సద్యఃఫలమే కాకపోతే ఈనాటికీ మనసు మరువకుండా ఉండగలదా! అంత ఆప్యాయమైన భోజనం.

మెరుపులు ప్రారంభమై వర్షం ప్రారంభమైంది. గాలి హోరుమంటోంది. ఇంటికి ఎట్లా వెళ్లటమా అని ఆలోచించుచున్న నావంక ఆ లలితాంబ నిలువబడి "విశ్వేశ్వరంగారూ! ఇంటివద్ద పాలకు ఏడ్చే పిల్లలులేకుండా ఉంటే ఆ గదిలో పరుపుమీద పడుకొని ఉదయం వెళ్ళవచ్చు"అంది. ఆ మాటకు వత్తాసే చేసేందుకు ముసలమ్మగారు గాఢనిద్రలో ఉండి లేకుండా పోయింది. మళ్ళీ కాస్త ఆగి "మీకేదైనా యిబ్బంది ఉంటే ఇంటికే వెళ్ళండి. బలవంత మేమీలేదు"అంది. ఎట్లా వెళ్లేది? గొడుగా లేదు. వర్షం అంతకంతకు అధికమవుతోంది. చివరకు — "సరేలెండని" వెళ్ళి పడుకున్నా. బయట తమ్మని ఉరుములేస్తుంటే లోపల నేను ముసుగుపెట్టుకొని హెచ్చుగా పడుకొని యిట్టే తెల్లవార్చుతున్నా — "కాని నాయనా! నా జీవితమట్లా తెల్లవారింది కాదు"—తెల్లవారింది. వర్షం వెలిసింది. కాని వెలిమబ్బులు తండాలుగా క్రమ్ముకుంటున్నై. వసారాలో "అత్తా! రాత్రి నేను స్వర్గంలో తిరుగుతున్నట్టు కల వచ్చిందే" అని లలితమ్మ ముసలమ్మతో అంటుంది. ముసలమ్మ "అమ్మాయీ! తలంతా పెన వేసుకుపోయింది, తలంటి పోసుకోరాదు" అని అత్త అంటోంది. నేను లేచి సరాసరి యింటికి వచ్చేశా.

## XII

మహాన్నాళ్ళు చేసుకుని ముసలాయన యింటికొచ్చాను. నాకు 15 రోజులు జ్వరం పట్టుకుంది. ఒంటరిగా ఉండటంచేత "మీకు పథ్యపానం సరీగ్గా జరగట్లేదు కనుక మా యింట్లో వచ్చి యుండమంటాడు ముసలాయన. లలితమ్మకూడ ముసలావిడను వెంటబెట్టుకొని వచ్చి మా యింటికివస్తేనేగాని వీలులేదని బలవంతంచేసి తమ యింటికి తీసుకువెళ్ళింది. ఎంతో సేవచేసింది. దగ్గరెవరూ లేకపోతే చెయ్యి ఊత యిచ్చి వరండాలోకి గదిలోకి తీసుకువచ్చేది. నారింజరసం బత్తాయిరసం ఇచ్చేది. వంట పనిఅంతా ఆముసలావిడమీద పెట్టేసి, నా దగ్గరే ఉంటూ ఉండేది లలితాంబ. మందూ మాకూలేని నా స్వంతవైద్యం. హృదయపూర్వకమైన ఆమె పరిచర్యా. యింకేం కావాలి? రోగం వెనకాడి పోయింది.

ఇంటికి వచ్చివేయమని మామ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. "వెళ్ళటానికి వీలులేదని లలితమ్మ తల్లంది. పత్యం వంట పడుతోందని ఉత్తరం వ్రాయించింది. మామ చిట్టిని పంపించాడు. లలితమ్మ నాకు బత్తాయి రసం ఇస్తూ తోచినసేవ చేస్తుంటే మా చిట్టి కంట పడింది. "చిట్టమ్మగారూ! వారికి ఏం కావాలో చూడండి"అని లలితమ్మ అంటే 'ఎంతమంది చూడాలి' అంటూ దీర్ఘం తీసింది. సరే అయితే నని లలితమ్మ కంటి రెప్పలాగా నాకు కనిపించింది. చిట్టి మూతి విరించుకు పడుకునేది.

జ్వరం పూర్తిగా నయమయింది. మామూలుగా భరంత వెళ్లి వస్తున్నా. లలితమ్మ మధ్యాహ్నాలపూట వచ్చి నా దగ్గర కూర్చుని చిట్టితో ఏదో ప్రసంగం మొదలు పెట్టేది. చిట్టి ఒకప్పుడు ఇష్టంగా మాట్లాడుతూ ఒక్కొక్కప్పుడు మూతి ముడుచుకునేది. "నువ్వు మూతి ముడుచుకున్నా సరే పొడుగు చేసుకున్నా సరే నా పరమావధి నాకు విశ్వనాథుడే నన్నేది"లలితమ్మ. చిట్టి

# ప్రకృతి వైద్య ప్రశంస

బండారు వేంకటరత్నం రేటూరు.

శ్రీమదనంతకోటి బ్రహ్మాండనాయకుండగు సర్వాత్మకుని యనుగ్రహముచే విరాజిల్లుచున్న ఈమహా ప్రపంచమునందు పూర్వకాలంబున జితేంద్రియులగు మహాయోగీంద్రులచే నాచరింపబడినటువంటి ప్రకృతి తత్వమును బాగుగాఁ దిలకించిన మహనీయులకు తెలియును గాని అన్యులకెరుకపడునా? మనోదేహేంద్రియము లొకరీతిగ వర్తించని మానవులకు, శ్రీపరాత్పరుని సత్యబోధ తెలియబడుట దుర్లభము. మరియు ప్రపంచములో ఆహారనిద్రాభయ మైధునాది సహజ కర్మలచే జీవించక కొందరు స్వంత తెలివి నుపయోగించి పట్టుదలగా స్వనాశహేతు వగు రోగమును సంపాదించుకొని చెడిపోయెడి దొక్క మానవజీవి తప్ప మరియొకటి గానబడుటలేదు. అట్లు చెడిపోవుచుండు మనుజులను మరింత చెరుపుటకై ఆధునికకాలమున నెన్నో వైద్యగ్రంథములు సృష్టింపబడినవి. ఆరోగ్యమును గోరు మానవోత్తములారా! నేటినుంచియైన నరకబాధ అనంబడు పాడువ్యాధుల కాలవాలమగు ఉప్పును తినుట తగ్గించి, ఈమాపై సాధారపడు మందు వైద్యులను రాక్షసుల చిక్కు దప్పించుకొని ప్రకృత్యనుసారులై సుఖముగా జీవించుచుండుడు. ఒక్క ఉప్పును తగ్గించినచో మానవు లెట్టి హింసలను చేయనొల్లరు. లోకములో రోగములెల్ల ఉప్పు తిను మానవులనే పట్టి బాధించుచున్నట్లు గుర్తించినవారికి తెలిసిన విషయమే. కృత్రిమాహార విహారాదులచే చెడియుండినను ప్రకృతి వైద్యమువలన తిరిగి శరీరమునకు రోగనిరోధపు శక్తి కలిగి తనకు గలిగిన రోగమునకు ప్రతిక్రియ నొసర్చిన శరీరము బాగుపడగలదు. సర్వజీవజంతువులకు మందులు అక్కరలేక ఆరోగ్యము గలుగుచుండగా మనుష్యునకు మాత్రము మందులతో అవసరమేమి? అంతేగాక మందు వైద్యులలో నిపుణోత్తములని పేరుపొందిన వైద్యులకు గూడ కుదరని రోగములను ప్రకృతివైద్యముచే కుదుర్చుచుండుట అందరెరింగినదే గదా! ప్రకృతి వైద్యమునకు లొంగని రోగములు లేవు. ప్రకృతి వైద్యముచే బాగుపడని రోగులు లక్షలాది ధనము ఖర్చుపెట్టి దేశములెల్ల తిరిగియు ఆరోగ్యమునుగాని ఉపశాంతినిగాని పొందలేరు. ప్రకృతి వైద్యమును మాత్రమే నమ్మి యితర వైద్యముల మానిన రోగులకు ఆయుర్దాయము లేకపోయినను ద్రవ్యహాని లేదు గదా! భూమిపై రెండు దినములు మాత్రముండి రాలిపోవు చెట్ల పుష్పములకు సైతము భగవాను డెట్టి యందమును బ్రసాదించి యున్నాడో మనము నిరంతరమును జూచుచున్నాము గదా! అట్టి పుష్పములకంటె ప్రకృతిలో విశేషకాల ముండవలసిన మానవుల సహజ సౌందర్యమెంత ప్రకాశవంతముగా నిర్మించియుండునో, మరియు ప్రకృతి సిద్ధముగా జీవించుటయందే మోక్ష ప్రదంబగు సర్వసంగపరిత్యాగ మున్నదను విషయమెరుంగక మానవులు కొందరు ఆస్తి, ఇల్లు, భార్యాలను విడచిపెట్టి యసత్యజనితంబగు మాయ సన్యాసమును స్వీకరించి మరింత లోకమున కంటుకొని సిద్ధులమైతిమని సంతసించెదరు. గాని, దానిచే నేమి ప్రయోజనము? ప్రకృతి కొరిగి వర్తించునట్టి పెద్దలసేవ, సత్సాంగత్యము, అహింసా వ్రతదీక్ష, వేదాంత ప్రశంస, శరీర వ్యాయామము, సహజాహారవిహారములు, బ్రహ్మచర్యము మొదలగు వాని వలన దురాచారములు మొదలు నశించి మానవులు ప్రాకృత జీవనులై సుఖించెదరు.

మానవులకు దుష్టకామమును గలిగించునట్టి మానవ ప్రకృతి విరుద్ధపదార్థములను విడిచి చూచినచో నందలి నిజము తెలియును గాని యెన్ని గ్రంథముల జదివినను యెన్ని మాటలు వినినను ఆచరణలేనిది ప్రయోజన ముండదు. మానవుడు ప్రకృతి ననుసరించుట ఉత్తమ ధర్మము.

# "ప్రకృ

గొల్లకోట సత్యరాజులు

ప్రకృతియంచు ప్రబలినావు
ప్రజలనెల్ల ప్రోచినావు
పరంజ్యోతివైన నీవు
పరమపావనీ. ౧

ధర్మమెల్ల నధర్మమయ్యె
దాతలెల్ల దీనులైరి
దారి జూప ననాథులకును
దివ్యరూపిణీ. ౨

దీర్ఘమైన వ్యాధులందు
దిక్కులెల్ల పిక్కటిల్లు
దీనజనుల రోదనంబు
ధరను గాంచవే. ౩

క్రూరులైన దీనజనుల
కఠినబాధలెల్ల దీర్చి
కరుణతోడ బ్రోతువమ్మ
కరుణదాయినీ. ౪

రోగమంచు మదిని స్రుక్కి
ఆరోగ్యమంచు అలవటించి
రోగార్తికి నిన్ను జేర
రక్షణగనవే. ౫

మందులంచు వెఱ్ఱిచేత
మదిని నిన్ను దలచలేక
మూఢులైన నీదుసుతుల
మూర్ఖత గనవే. ౬

నమ్మినాము నిన్నె మదిని
ఒరులనెపుడు నమ్మమంచు
నిన్ను మదిని వినుతి సేయ
మూరడింపవే. ౭

దైన్యమంది దిక్కులేక
దిక్కు నీవటంచు మదిని
దాపులేరు వారికెల్ల
ధైర్యమొసగవే. ౮

ఫలములందు నీదుశక్తి
ప్రకృతియంత నీదుమహిమ
ప్రీతిఫలింప వెలుగుచుండు
పరంజ్యోతివే. ౯

నీదు నామస్మరణతోడ
నీదు సేవ చేసికొంచు
నిన్ను నమ్మువారి నెల్ల
నెటులజూతువో. ౧౦

ఆనంద మొసగదలచి
ఆశ్చర్యమందగాను
అద్భుత చికిత్సతోడ
అలరుచుండువే. ౧౧

మందులేని వైద్యమందు
మహిమతోడ వెలసి నీవు
మందహాస మొసగ నేల
మాతృ పావనీ. ౧౨

లోకులెల్ల నిన్ను గూర్చి
లోకములో చాటుచుండ
లోకమాత వగుచు నీవు
లక్ష్యమొసగవే. ౧౩

అఖిలలోక వ్యాప్తమైన
అమరగానవినుతమైన
ఆదిశక్తిరూపివైన
అంబిక నీవే. ౧౪

భక్తితోడ రోజునిన్ను
బూజసేయు భక్తజనుల
భాగ్యమీయునందు భువిని
భువనపాలినీ. ౧౫

ఓం శక్తిః.

# మసూచి

అయ్యా! మా ఊరిలో మసూచికములున్నవి. నాకు తీవ్రముగా, జ్వరము వచ్చినది. అప్పుడు రుద్రరాజు నరశింహారాజు అన్నగారిని పిలిచి నాస్థితి చెప్పగా 4 గు రోజులు ఎనిమా, ఒండ్రుపట్టీలు, అవిరి వగైరా చేసిరి. 4 గు రోజులయనంతరం మసూచి యనుమానం కల్గినది. పొక్కులు పొక్కినవి. అప్పుడు నరశింహారాజుగారు కేశవరం వెళ్లి శ్రీ ప్రకృతి డాక్టరుగార్ని సలహా అడిగి వస్తానని చెప్పి వెళ్లినారు. అప్పుడు డాక్టరుగారు ఇచ్చిన సలహాను తీసుకొని వచ్చి తడిపట్లు వేస్తూ ఆహారం కొబ్బరినీరు ఇస్తూ పై చెప్పిన చికిత్సలు చేస్తూ ఉండగా 10 వ రోజుకు శరీరమంతా కళ్లుకూడా కనుపించకుండా పెద్ద పోతపోసినది. ఏరోజుకూడా తలకు స్నానం మానలేదు. వారం రోజులు కళ్లు చూచుటకు వీలులేని కారణంచేత నాకు చాలా అధైర్యం కల్గినది. ఏమనగా కళ్ళల్లో పువ్వులు వేసి ఇక కళ్లు కనబడవేమో అని మళ్లా నరశింహారాజుగార్ని అడిగి కంగారు చేసితిని. వారు కేశవరం వెళ్లి డాక్టరుగార్ని కనుక్కొనగా మన టీకీలో అటువంటి ప్రమాదములు ఏమీ రావు, కొంచెము నెయ్యి కళ్ళకు రాసి విడదీసి చూడమని చెప్పినారట. నరశింహారాజుగారు వచ్చి డాక్టరుగారు చెప్పినట్లు చేయగా కళ్లు శుభ్రముగా దేదీప్యమానంగా కనుపించినవి. నాకు చాలా ఉత్సాహముగా ఉన్నది. ఇంక 5 రోజుల వరకు బత్తాయి నారింజ వగైరా పండ్లు ఇచ్చిరి. తరువాత ఆకలి బాగా హెచ్చుగుటవల్ల ఉదయం చప్పిడికూర మజ్జిగతో అన్నమున్ను సాయింత్రం గుమ్మపాలు, తియ్యని పండ్లు ఇచ్చిరి. ఇట్లా వారం గడిచిన తరువాత ఉదయం మాదిరిగానే సాయింత్రము కూడా అన్నం పెట్టించిరి. అన్నం ప్రారంభించేటప్పటికి చిలకబారినది. 3 వ పూట అన్నం ప్రారంభించేటప్పటికి పొక్కులు శుభ్రముగా రాలిపోయి పుళ్లు మాని పోయినవి. ఆరోజు లగాయితు చాలా కులాసాగా పని పాటలు చేసుకొనుచున్నాను. ఈ వైద్యములో ఇంత తేలికగా పథ్యపానాదులతో నిమిత్తము లేకుండా ఈ ప్రకృతివైద్యములో ఇంత తేలికగా ఈ మసూచికమనే మహావ్యాధి నయమయినందుకున్ను, మహానుభావుడైన శ్రీ డాక్టరు వేగిరాజు కృష్ణంరాజు గారు చేయించిన చికిత్సలవల్లనున్ను చాలా ఆరోగ్యవంతుడనై ఆనందిస్తూన్నాను. గనుక ఈ మశూచి విషయములో ఎవరికి ఎప్పుడు సంభవించిన ఆ డాక్టరుగారి సలహాలను పొంది చికిత్సలు చేసుకొని బాగుండెద రని నేను నమ్ముచున్నాను.

పెన్మెత్స సూర్యనారాయణరాజు,
మో గ ల్లు.

---

## ప్రకృతి ధర్మ పరిషత్ వారి చికిత్సాలయము, సత్యనారాయణపురము, బెజవాడ.

ప్రధాన చికిత్సకుడు : డాక్టరు కొలిపాక ఆదినారాయణశర్మ.

ఈ చికిత్సాలయమునందు సమస్త వ్యాధులను వివిధ ప్రకృతి చికిత్సల సహాయముచే నివారింప బడును. రోగులు చికిత్సాలయమునందు నివసించుటకు తగు వసతులు కలవు. బయటి రోగులకు సలహాలివ్వబడును. ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా కూడా సలహాలివ్వబడును. రోగులు చదువుకొనుటకు గాను పెద్ద ఆదర్శ గ్రంథాలయము కూడ నెలకొల్పబడినది. [illegible]

# ప్రకృతి పురుడు - తక్కువ ఖర్చులతో

నేను మొదటి ప్రసవమునకు యీ క్రింద వ్రాసిన విధముగా గడిపితిని. ప్రసవమయిన మూడవరోజున మామూలుగా పథ్యం అనగా అన్నముతిన్నాను. 5 రోజులు గడచినతరువాత 6 వ రోజు తెల్లవారుజామున కుడిచెయ్యివణకి, పాలు ఎక్కువయి, స్తనమువాచి బాధతో శరీరమంతయు వణకి, తీవ్రమయిన చలిజ్వరమువచ్చి, బిగిసిపోయి, ఏమియు తెలియక ఒక గంటవరకు వుండి తగ్గినది. అప్పుడుమొదలు సుమారు 6 మాసములవరకు 10,15 దినముల కొకసారియును తరువాత నెలకు; 2 నెలలకొకసారి ఇట్లా 2 సంవత్సరములవరకు నన్ను ఈ ఫిట్సు పీడించినవి. పనిచేసుకొనుటకు కుడిచేయి పట్టు యిచ్చేదికాదు. యీ రోగము వచ్చేముందు కడుపులో ఉడుకు, ఆకలియెక్కువ, నులిపురుగు, కండ్లు కాన్పించకపోవడము తటస్థించినది. ఒకటి రెండుసార్లు గ్రహణికూడా పీడించినది. ఈ వ్యాధులకొరకు భీమవరం అలోపతి డాక్టర్ల వద్దనున్ను, రాజోలుతాలూకా బట్టేలంకకాపరస్తులు మూర్ఛరోగములకు వాతరోగములకు వైద్యమున పేరొందిన ఆయుర్వేద డాక్టరుగారి వద్దను మందు పుచ్చుకొన్నన్నాళ్ళు ఫిట్సు రాలేదు. మందుమానినతరువాత తిర్గి మళ్ళా వచ్చినది. ఇప్పటికి 2,3 వందలు ఖర్చుపెట్టితిమి. గాని లాభంలేదు. అప్పుడు ప్రకృతి డాక్టరు శ్రీ వేగిరాజు క్రిష్ణంరాజుగారు నా కిచ్చిన ప్రోత్సాహబలంవల్ల ప్రకృతిపురుడు నేనుకూడా పోసుకుందామని కుతూహలపడితిని. కాని మావాళ్ళు పండ్లకు, కూరకాయలకు యెక్కువఖర్చు అవుతుందని జడిసినారు. దైవవశాత్తు మేనెల గాడ్పులకు జడిసి కారము, పులుసు మాని కొంచెము ఉప్పువేసి ఉడికిన కూరలు మజ్జిగతోను తినెడిదానను. ఈలాగున 4గు మాసములున్నతరువాత 1940 సెప్టెంబరు 5వ తేదీ రాత్రి గం 10-40 లకు యేబాధలు లేక సుఖప్రసవమయి, ఆడశిశువును గని శ్రీ వేగిరాజు క్రిష్ణంరాజుగారి సలహాలకై యింటి దగ్గరనే యీ ప్రకృతి పురుడు తక్కువ ఖర్చులతో పోసుకొంటిని. అప్పటినుంచి అనగా సుమారు 3 సంవత్సరములనుంచి అత్తవారింటి వద్ద పుట్టింటివద్దకూడ ఆయుర్వేద యింగ్లీషు వైద్యము వగైరా అన్ని పారదోలి, ప్రకృతి ననుసరించియే వైద్యమును చేసుకొనుచున్నాము. కొద్దిరోజులలో ఈ సత్యవైద్యమును నమ్మి అన్ని కుటుంబములు యీ ప్రాంతమున నున్న శ్రీ వేగిరాజు క్రిష్ణంరాజుగారి ఆశీర్వాదమును పొంది సుఖించెదరుగాక యని అనేక వందనములర్పించుచున్నదానను.

ఇట్లు,

సోదరి, కళారి రామయ్యమ్మ.

పాంకోడేరు.

# రోగవృత్తాంతములు జాబులు

## కరిమేహము.

అయ్యా! ఈవ్యాధి నాకు సంవత్సరంలో అనగా బాల్యదశలోనే అంకురించినది. ప్రథమములో పిక్కలకు కర్పాణిమాదిరిగా వచ్చినది. దానికి ఆయుర్వేదమందులు వాడినారు. క్రమంగా వ్యాధి ముదిరి పాదమువరకు వచ్చి, చీలమండవద్ద ముందునను, మడమకు, అరికాలులోను పెద్ద పుండుగా పడినది. అది చాలా దురదగా ఉండేది. చేతివేళ్ల సందున పుళ్లు, కాళ్ళకు మోకాళ్ళ క్రింద అక్కడక్కడా పుళ్లు, చీలమండకి క్రింద ముందుభాగమందు తెల్లని, ఎర్రని పుళ్ళు మడమఅంతా పుండ్లు, అరికాలంతా పుండ్లు ఈ విధముగా 2 కాళ్ళకుకూడా ఈ పుళ్ళు ఎక్కువదురద, గోకిన నుసి నీరు కారుట, చీము కారుట, రక్తము కారుట, పొలుసు రేగుట, పగులుట, మంటగాకూడా ఉండుట, కడుపులో అప్పుడప్పుడు మంట, గుండెలో దడ, ముఖము రంగుమారి గాదరించినట్లుగా ఉన్నది. 2 పాదములు వేళ్ళవరకు చర్మము చాలా దళసరిగా ఉండుట, ఈ వ్యాధులన్ని రాకపూర్వం అనగా ప్రథమంనుంచి మందులు యింజక్షనులు చేయించి 1000 రూపాయలు ఖర్చుపడగా రాను రాను శరీరమంతయు పై వ్రాసిన విధముగా బాధలకు గురికావలసి వచ్చినది. ఇక గత్యంతరవ ఏమి కనుపించలేదు. అప్పుడు కొంతమంది కేశవరంలో ప్రకృతి డాక్టరుగారు ఉన్నారు, వారి ఆశ్రమంలో సర్వరోగ నివారణ అవుచున్నది కనుక, నీవు అచ్చటకు వెళ్ళవలసినదని నాకు చెప్పిరి. ఆ మాటలువిని వెంటనే డాక్టరుగారివద్దకు వచ్చితిని. వారిని చూచుటతోడనే నా వ్యాధి తగ్గినట్టుగా నాకు ఉత్సాహము కలిగినది. డాక్టరుగారు కూడా నీ వ్యాధి మాసంరోజులకు నిర్మూలం కాగలదని నాకు బోధించి చికిత్సలు ప్రారంభించిరి. వారు చెప్పినట్లుగానే మాసంరోజులకు నుగుణం కనుపించినది. ఇంకా ఒక మాసం ఆశ్రమంలో ఉండి జలచికిత్స ఆహారమార్పులు విధానమంతా డాక్టరుగారివల్ల వ్రాయించుకొని యింటికి వచ్చితిని. మొదట అంతడబ్బు ఖర్చు పెట్టుటతప్ప ఏమిలాభము లేకపోగా మరి కొన్ని వ్యాధులు సంప్రాప్తమయినవి. దైవానుగ్రహమువల్ల నా కర్మ పరిపక్వదశకువచ్చి ఈ ప్రకృతిడాక్టరుగారు దర్శనమిచ్చి నాకు తక్కువ ఖర్చులతో శరీరారోగ్య మిచ్చినారు. కనుక వారికి సర్వేశ్వరుడు ఆయురారోగ్యము లిచ్చి రక్షించి వారిద్వారా ప్రజలను రక్షించుగాక యని ప్రార్థించుచుంటిని.

కొండ్రగుంట వెంకట సుబ్బయ్య.
యింజరంపాడు.



## కడుపుమంట.

అయ్యా! నాకు 6 మాసములనుంచి కడుపులో మంట, శరీరముపై మంట, గడ్డముక్రింద తామర లాగునవేసి దురదగాను రసికారుచుండును. కొత్తపేటలోను మా గ్రామములోను యింజక్షనులు యిచ్చినారుగాని తగ్గలేదు. 400 వందలు ఖర్చుపడగా వచ్చిన లాభమేమిటీ అంటే వ్రాస్తూన్నాను. గుండెబరువు, విరేచన బద్ధకం, శిరస్సుమంట, దిమ్ముగా ఉండుట, నిద్రపట్టక పోవుట, కడుపులోనుంచి గొంతుక లోనికి ఆవిరిక్రింద వచ్చుట, కాళ్లు, గుండె, కంఠము, చెవులు, మంట, తలపోటు, కాళ్లు, చేతులు, నడుము, ఎక్కువగా లాగుట. అంబంరమెక్కువ, నోటివెంబడి నీళ్లు యెప్పుడు కారుచుండును. ఆకలిఉన్నది. తింటే జీర్ణముకాదు, నీరుడు మెరగా వెళ్ళును, శుక్లనష్టమున్నది, నరములన్ని యెక్కువ నొప్పిగా ఉండును. కీళ్ళు మెదిలిన వెంటనే విరుగుడు, గోళ్ళు మంట,

కుడిడొక్కలో యెక్కువమంట బయలుదేరినది. అప్పుడప్పుడు ప్రేగులు బిగబట్టినట్లుండును. ఇట్లుండగా వినికిడివల్ల తెలిసికొని కేశవరం ప్రకృతి ఆశ్రమంలో డాక్టరుగారికి చూపిస్తే తగ్గుతుందని ఆశతో అచ్చటికి వచ్చితిని. శ్రీ డాక్టరు వేగిరాజు కృష్ణంరాజుగారు ఆశ్రమంలోనే ఉన్నారు. అప్పుడు నన్ను చూచి నీకేమి భయంలేదు, నీవ్యాధి వెంటనే తగ్గుతుందని నాకు ధైర్యోత్సాహములు ఇచ్చి చికిత్సలు ప్రారంభించినారు. 2 మాసములు ఆశ్రమంలోనే ఉంచి నావ్యాధి నిర్మూలంచేసి నాకు ప్రాణదాన మొనంగి నన్ను కులాసాగా ఇంటికి పంపించిన శ్రీ డాక్టరుగారికి అనేక వందనము లర్పించుచూ ప్రజలందరు వీరి ఆశీర్వాదములతో రోగవిముక్తులు కౌదురు గాక అని వేడుచూ, శ్రీ భగవానుడు శ్రీ డాక్టరుగార్కి పూర్ణారోగ్య ఐశ్వర్యము లిచ్చి రక్షించుగాక.

సత్తి సత్యన్నారాయణరెడ్డి.
ఊబలంక.

## ప్రకృతి పురుడు

నాకు 6 సంవత్సరముల నుంచి అజీర్ణము, విరేచనములు, కడుపుఉబ్బు, గుండెబరువు, దుడుకు, ఆయాసము, కాళ్లులాగుట, నీరసము, పనిపాటలు చేయుటకు చికాకుగా నుండుట, ఇట్లుండగా ఆయుర్వేదము కొన్నాళ్లు వాడితిని. ఏమి ప్రయోజనం కనుపడలేదు. తరువాత ఇంగ్లీషు వైద్యం, అరకులు, ఇంజక్షనులు చేయించిరి. ఎంత డబ్బు ఖర్చుపెట్టినా డబ్బు ఖర్చు తప్ప ఫలితం కనుపించలేదు. అంతకంతకు నీరసము, వ్యాధులు హెచ్చి చాలా బాధపడుచుండగా కేశవరంలో ప్రకృతి డాక్టరుగారైన వేగిరాజు కృష్ణంరాజుగారికి చూపిస్తే వ్యాధి కుదురునను నాశతో వెళ్లి వారికి చూపగా భయములేదు. ఆహారం మారిస్తే సరిపోవు నని తొట్టిస్నానం వగైరా చికిత్సలున్ను, ఆహారం మార్పులును చేయించిరి. 7 వ మాసము రాగానే ప్రకృతి చికిత్స ప్రారంభించితిని. మాసములు పూర్తి అయ్యే సరికి బాధలన్ని తగ్గి చాలా ఆరోగ్యం వచ్చినది. ఇదివరకుకంటె ప్రసవము కూడా చాలా తేలికగా ప్రసవించితిని. ఆడబిడ్డ పుట్టినది. ఇదివరకు పిల్లలకు పాలు ఉండేవి కావు, ఆవుపాలు పట్లేవాళ్లము. ఈ బిడ్డకు పాలు పూర్తిగా సరిపోయినవి. ఇదివరకు వలె నాకు ఇంగువ బెల్లం వగైరా పాడు మసాళాలున్ను, బిడ్డకు ఆముదము నూనె కర్పూరము వగైరా ఏమి అక్కరలేకుండా దేశోద్ధారకులైన ప్రకృతి డాక్టరుగారు చక్కని గాలి, చల్లని మంచి నీరు, ప్రసవించిన 6 మాసములవరకు వండని కూరలు, ఫలాలు, మజ్జిగ వగైరా వస్తువులన్నియు పెట్టించిరి. ఇంత ఆరోగ్యము వస్తుందనిన్ని, అసలు జీవింతు నని కూడా నాకు నమ్మకం లేదు. అటువంటి అపనమ్మకం మనిషిని ప్రకృతిదేవి కనికరించి నాకు పూర్వముకంటె మంచి ఆరోగ్యమిచ్చినది ముందు స్త్రీలు బాగుపడితే వెనుక పురుషులకు కూడా త్రోవదొరికి అన్నికుటుంబములు కూడా రోగాలకు దూరం కావచ్చునని నాసమ్మకము. నా సోదరీమణులందరు నావలె సుఖింతురు గాక! నాకు పూర్ణారోగ్యమిచ్చిన డాక్టరుగారికి అనేకవందనము లర్పించుచు వ్యాసము ముగించితిని.

కొత్తపల్లి పత్తెమ్మ.
కంచుమర్తి గ్రామం.

### మూత్రపు సంచిలో పుండు

నాకాపురస్థలము పాలకోడేరు. నాకు 18 సంవత్సరములవయస్సులో మూత్రము వెళ్లిన తరువాత పోటుపుట్టినది. చాలా బాధకూడా కలిగినది. కొబ్బరినీరు పుచ్చుకొంటిని గాని తగ్గలేదు. బాధ యింకా హెచ్చినది. నిద్దుర లేదు. అప్పుడు హోమోపతి వాడితిని గాని తగ్గలేదు. అన్నం హితవులేదు. నీరసము హెచ్చుచున్నది. మావాళ్ళు కంగారుపడి భీమవరం లేడీఆస్పటలకు తీసుకు వెళ్లగా 6 ఇంజక్షనులు చేసిరి. అరకులుకూడా ఇచ్చిరి. ఒక మాసము రోజులకు క్రమముగాతగ్గినది. తరువాత 2 సంవత్సరములకు ఇదివరకటికంటె మూత్రబాధ హెచ్చుకాగా మరల వెనకటి లేడీ డాక్టరుకు చూపగా 8 ఇంజక్షనులు చేసినది. 2 మాసములకు క్రమముగా తగ్గినది. మరల 2 సంవత్సరములకు తిర్గి వెనకటి బాధలు ప్రవేశించుటయేగాక పొత్తికడుపు బిగపట్టుట, నిలబడలేకపోవుట ప్రతిగంటకు మూత్రంవెళ్ళుట, ఇట్లుండగా ప్రకృతివైద్యము చెయ్యమని అందరు ప్రోత్సహించిరి గాని నేనే చెయ్యలేనని జడిసి వెనకమాదిరిగా ఆ డాక్టరుకే చూపినాను. ఈ సారి 12 ఇంజక్షనులు చేసినది. కాని ప్రయోజనములేదు. వేసవికాలము మూలముచేతనో ఇంజక్షనుల చేతనో చాలా బాధలుపడి యమలోకములో బంధించినట్లు ఆస్పటలులో మూడు మాసములు బంధింపబడి చివరకు కొంతవరకు తగ్గినది. మరల సంవత్సరమునకు వెనుకటివలె సకల బాధలు కల్గినవి. అప్పుడు కేశవరమునుండి వేగిరాజు కృష్ణంరాజుగారు మాగ్రామంరాగా వారికి నన్ను చూపించినారు. వారు పరీక్షించి ఇది అసాధ్యమైన రోగ మనియు వెంటనే చికిత్స ప్రారంభించమనియు, చేయకున్న ప్రాణాపాయము రాగలదనియు ఆశ్రమము రావలెననియు చెప్పిరికాని వేసవికాలమగుటచే నీరసములో ఈ చికిత్సలకు అగుట కష్టమని తలంచి ఇచ్చటనే ఆయుర్వేద డాక్టరుచే మందు ఇప్పించిరి. తగ్గుటకు బదులు హెచ్చినది. 200-0-0 ల రూపాయలు ఖర్చు పెట్టి ఏమియుతోచక మరల వెనుకటి ఆస్పటలకు వెళ్ళితిమి. ఆమె పరీక్షచేసి మూత్రపుసంచి పుండుపడినదనియు మావల్ల కాదనియు విశాఖపట్నం వెళ్ళమనియు చెప్పినది. తరువాత ఇక ప్రకృతివైద్యము తప్పదని ఉపవాసము లేకుండానే ఒకపూట భోజనమున్ను సాయింత్రము పండ్లున్ను తొట్టిస్నానం వగైరా చికిత్సలున్నూ ప్రారంభించగానే వెంటనే బాధలు ఉపశమించినవి. సోదరీమణులారా! మీరందరును నావలె మొదట జడియక ప్రకృతిమాతను సేవించి డాక్టరు వేగిరాజు కృష్ణంరాజుగారి సలహాలను పొంది సుఖించవలసినదిగా కోరుచున్నాను. నాకు ఆరోగ్యమిచ్చిన డాక్టరు కృష్ణంరాజుగారికి అనేకవందనము లర్పించుచున్నాను.

ఉ నా థ రా జు సూ ర మ్మ.

### ప్ర కృ తి పు రు డు

ప్రపంచంలో ఉండే పాడువ్యాధులను దూరం చేసే ప్రకృతిదేవిని ఆశిస్తూ ప్రజలకు వ్రాసే నావిన్నపము. నాకు 18 వ సంవత్సరంలో గర్భిణీ వచ్చి మగశిశువు జనించి మరణించినాడు. మరల సంవత్సరమునకు ఆడపిల్ల జనించి ఆమెకూడ ముందు మాదిరిగానే జరిగినది. అప్పటినుంచి అజీర్ణము విరేచనములు ఆయాసము, గుండెదడ, నెలసరి జరగక పోవుట, స్థూలశరీరము పెరుగుట ఈ విధమైన బాధలు కల్గగా బెజవాడలో డాక్టరు రంగ

నాయకమ్మకు చూపగా ఇంజక్షనులు చేయవలెనన్నది. మా వారు ఆయుర్వేద డాక్టరుగారు ఇంజక్షనులు ఇష్టము లేక లోధ్ర సీసాలు కొన్నాళ్లు ఇచ్చినారు. దానివల్ల ఏమియు ప్రయోజనం కనుపించక ప్రకృతి చికిత్స చేయుట మంచిదని ప్రోత్సాహించినారు. అప్పుడు డాక్టరు వేగిరాజు కృష్ణంరాజుగారి సలహా పొంది చికిత్సలు ప్రారంభించితిని. అపక్వాహారము తింటూ, తొట్టి చేయుగా వెనుక బాధలు తగ్గి నెలసరి ప్రతినెలా సవ్యముగా జరుగుట కల్గినది. ఇట్లు సంవత్సరము చేయుగా గర్భిణీ వచ్చినది. 3 వ మాసము వచ్చిన తరువాత ఒకపూట కూరలతోను మజ్జిగతోను దంపుడుబియ్యపు అన్నమున్ను ఒకపూట పండ్లున్ను తొట్టివగైరా చికిత్సలున్ను మాసములు పూర్తి అయ్యేంతవరకు చేసితిని. ఇదివరకుకంటె చాలా తేలికగా ప్రసవించితిని. ఆడబిడ్డ జనించినది. ప్రకృతి పురుడే పోసుకొంటిని. అంధకారబంధురమైన జైలు తప్పి చల్లనిగాని, చల్లని మంచి నీరు, చక్కని వెలుగు వగైరా చికిత్సలతో హాయిగా పదిరోజుల పురుడు 10 ఘడియలుగా జరిగినది. ఇదివరకు పురుళ్లకు జ్వరము, కడుపునొప్పి, వగైరా బాధలతో చాలా బాధపడితిని. ఈదఫా అట్లు బాధలేమి లేకుండా చాలా ఉత్సాహంగా సుఖంగా ఉన్నది. ఇదివరకు పాలు చాలక క్షీరవర్ధని సీసా వాడితిని. ఈసారి ఏ సీసాలు అక్కర లేకుండా బిడ్డకు పాలు సరిపోవుచున్నవి. కాబట్టి ప్రకృతివైద్యము చేస్తే భయమని ప్రజలందరు జడిసేరు. ఏమి భయంలేదు. తప్పక అందరు ప్రకృతి పురుళ్లు పోసుకొని అమోఘమైన పాలతో బిడ్డలను కులాసాగా పెంచుకొనెదరు గాక అని వేడుచు, పురుళ్లే కాదు, ఏ యొక్క వ్యాధి అయినను సరే, శ్రీ డాక్టరు గారైన వేగిరాజు క్రిష్ణంరాజు గారి సలహాలతో వ్యాధులను దరిచేర నివ్వక ఆరోగ్య ఐశ్వర్యవంతులయ్యెద రని నా ప్రార్థన. ప్రపంచాన్ని ఉద్ధరించే మహానుభావులైన క్రిష్ణంరాజుగారికి ఆయురారోగ్య మిచ్చుగాక యని భగవంతుని వేడుచు వారికి అనేక వందనము లర్పించుచున్నాను.

ఇట్లు, తమసోదరి
గొడవర్తి మహాలక్షమ్మ.
బెజవాడ.

(16 పేజీ తరువాయి)

తర్వాంతకూడా తాను మారక, మనకు మార్పులేకా, స్వామివారికి యథాస్థ సన్నాహంలో ఉండేది. లలితమ్మ నామట్లా కోటలుకట్టి „నావిష్ణుః పృథివీపతిః'' అన్నట్లు పూజించేది. జయాపజయాలు నాభుజాలమీద తాంచ వించేవి. చివరకు చిట్టి చెప్పే చెప్పుతో మామయ్య ద్వారా సాధించాలని తల్లి దగ్గరకు వెళ్ళిపోయేది. మళ్ళీ దాడి చెయ్యటానికి వస్తూ ఉండేది.

వచ్చి కాదా – వచ్చి కాదా రాళ్ళతో రాలకొట్టుకుని తినాలనుకునే అల్లరిపిల్ల కాయకంటె దయింది చిట్టి. ఆకాశమమ్మట అటూ యిటూ ఎగురుతుంటూ వచ్చి వచ్చి కమ్మని వాసనలను కనిపెట్టి పచ్చటాకుల సందున నక్కి దోరపండు కాయలతో పొట్టనింపుకునే చిలక పడుచయింది లలిత. వీరిద్దరికీ నీడయిచ్చి నిలుచుంది గున్న మామిడి. తన ఫలాలు ఇద్దరికీ అందించుకుంటూ!— నాయనా! ఆ మామిడన్నా నిలూనా ఎండిపోగూడదూ! కాపలు లేకపోనుగా! ఇదిగో యిక మగిసిపోయింది. నాకు మునిగిపోయిం''దని కన్నీరు కార్చాడు.

మూర్తి ఓదారుస్తూ అన్నిరోజులు మనకెందుకవుతై... అన్నాడు. “ఔను! నాయనా! అటువంటి రోజే వచ్చిందది తన మానమర్యాదలకు భంగం రానిచ్చింది కాదు. నా మానమర్యాదలు పోనిచ్చింది కాదు. ఎన్నోయాత్రలకు నావెంట నడిచింది. ఎంతో ఆమెను ప్రయాసపెట్టి ఆమె ఉసురు పోసుకున్నా. అదైనా నాకుతగల్లా. ఒక యాత్రలో మధ్యారణ్యప్రదేశంలో నిశిథిలో ఆగాలిసి వస్తే, నాకు మెత్తటి పక్క చూపి వెచ్చటి సెగదుపెట్టి నా సంతోషాన్ని చూచుకుని తాను ఆనందించుకుంది. చిట్టి ఆ సెగదువేడికి ఎండిపోయిందేమో, బండలాగే పడుకుంది. అడవిలో కాస్తున్న వెన్నెల్లో ఏదేదో మాట్లాడుతూ ఉంది లలితమ్మ. నాయనా! నాచూపులు చదువుకుని చేతలు చేసుకుంది – తనకు జారిపోయిన ప్రియత్వాన్ని ఆ విధంగా పూర్తిచేసుకుంది. నాకు దూరమైన మధురజీవితాన్ని పిలిచి పెట్టింది. నాయనా! ఆ తల్లి ఏదీ? తాను నిలుపుకోలేకపోయింది. అబ్బా! నాకు నిలుపలేకపోయింది. ఆ ఎనిమిది సంవత్సరాలే ఎనిమిది రోజులుగా మార్చింది. ఏమని చెప్పనూ! ఎంతని చెప్పనూ.

## XIII

అది కార్తీకమాసం. మామామ రమ్మని ఉత్తరం వ్రాశాడు. వెళ్ళను. పనికూడా అయిపోయింది. తిరిగి గంజాం రాకూడదూ? ఎట్లా రాగలనూ? మొదటినుంచీ దురదృష్టబ్రతుకే నాయిరి, ఏదో మధ్యలో నాజీవిత కలశంలో రెండు అమృతబిందువులు రాలినా.

మా చిట్టీ – అత్తా నన్నే సాధించటం మొదలు పెట్టారు. గంజాంలో వద్దు, ఇంకెక్కడన్నా ఉండమంటారు. మా మామ అట్లాగే అంటాడు. “అక్కడ యిల్లుకట్టుకునే ప్రయత్నంలో ఉన్నాను గనుక అక్కడే ఉండాలి” అంటా నేను. “నువ్వు వెళ్ళావద్దు – నేను రానూ రాను” అంటుంది చిట్టి. నా మృదుస్వభావాన్ని చిదిమి నేలపాలు చేస్తుంది. లలిత దీనిని సువర్ణపాత్రలో కత్తి తేరపెడుతుంది.

నేను బయలుదేరవలసిందే. మా కొట్టులెక్కలు తనిఖీకి మృత్యువులాగా ఒక గవర్నమెంటు ఉద్యోగివచ్చి కూర్చున్నాడు. రోజులు గడిచినై. నాకేదో భయం కలిగింది. కారణం కనుపించదు. ఎవరో ఆకాశాన విమానంలో ఎగిరిపోతూ ఏడుస్తున్నట్లూ, లలితాంబ పెద్ద నది ఒడ్డున నిలబడి నన్ను పిలుస్తూ „నన్ను దాటించు విశ్వంగారూ'' అంటూ బతిమాలుతున్నట్టూ స్వప్నమొచ్చింది– „నాయనా! తాను స్వప్నములో దర్శనమిచ్చి నన్ను రక్షించమందిగాని నేనేం చేయగలిగానూ? చెయ్యనా అందించగలిగానా? కలలో ఇంత గందరగోళం పడ్డా, లేచి ఊరుకున్నా. ఆరోజు అష్టమి. క్రిందటిరోజు నా తల్లి లలిత, మెట్లమీదపడి నెత్తురు కక్కుకొన్నదట. స్పృహపోయినది. ఏదో వైద్యం చేశారుట. రాత్రి తెలివి వచ్చిందట– „అబ్బా నాయనా! ఇక చెప్పలేనోయ్'' అంటూ దుఃఖాన్ని ఆపుతూ లలిత తన అత్తను పిలిచి నెమ్మదిగా „అత్తా! విశ్వంగారిని పిలిపించుతావూ, చూడాలని ఉంది. నేను బ్రతుకనం''దిట. ఆ మాటలతో ముసలావిడ మతిపోయి ఊరుకుంది. ఇంతలో లలితకు మగత వచ్చింది. మళ్ళీ నెత్తురు ప్రవాహం బయటికి వచ్చింది. పెద్దడాక్టరుని తీసుకువచ్చారు. „అంతా క్షణాల్లో ఉంది, ఎవరైనా తమ నెత్తురు ఆవిడకు ఇస్తే బ్రతుకుతుం''దన్నారు. మా లలితకు మళ్ళీ స్పృహవచ్చి „అత్తా! ఆయన వచ్చారా?'' అని కళ్లువిప్పి నెమ్మదిగా అడిగిందిట. నాయనా! అప్పుడు నేనుండగూడదూ! నా నెత్తురేమిటి– ప్రాణాన్నిచ్చి బ్రతికించుకోనూ, అంటూ పెద్దఏడుపును మింగేశాడు. ముఖం పాలిపోయింది. కొంతసేపు చేతనత్వం లేకుండా పోయింది. మూర్తి మాడావిడితో కుండలో నీళ్ళు ముఖాన జల్లాడు.

విశ్వం మళ్ళీ కళ్లు తెరిచాడు. 'ఏదీ లలిత' అన్నాడు. మూర్తి నివ్వెరపోయాడు. "ఇప్పుడు వచ్చి ఓదార్చిందిగా!" అన్నాడు. "నాయనా! ఒక పిశాచంగానైనా అయి నన్ను వహించి నన్ను తనలోకి తీసుకోకూడదూ. ఎందుకు చంపుతుంది, కంటిమీద ఈగనైనా వాలకుండా కొయ్యికన్నులతో చూచిన తల్లి,"

ఆమె మరణవార్త విని నే నెట్లా బ్రతికానో? నన్ను ఓదార్చినా రంటున్నారూ? నా చిట్టి వచ్చి నన్ను ఓదార్చకూడదూ. రాదు. దాని పగేమిటో? నా గుండె పగిలిపోగూడదూ! దాని గట్టితనమేమో! అయిపోయింది. ఇంకేం చెప్పుకోనూ. ఆ రాద్రోజా వెళ్ళా, ముసలమ్మ అప్పుడన్నది. నా శిష్యుడు ప్రక్కలో పడుకొని వెళ్ళిపోయినాడు. నాకు మైకంగా వచ్చింది. ఆ తెరలో లలితమ్మ స్పష్టంగా కనపించి నవ్వుతూ నుంచుంది నాకు మళ్ళీ తెలిసింది. "నీవు సంతోషంగా ఉంటే నే నెందుకు దుఃఖించాలని తోచింది." ఆ సాయంత్రం ఆ స్మశానాలలోకి వెళ్ళి ఆ చితిని చూచుకున్నా. మళ్ళీ లలిత స్ఫురించింది. ఇంత బూడిద తీసుకున్నా. "ఏంచెయ్యగలను? మాచిట్టి రాలా. భారం ఎట్లా తగ్గుతుందీ. దేశాలవెంబడి తీర్థాలవెమ్మటి తిరుగుతున్నా! నాయనా! ఈరోజు ఆ పవిత్రదినం. క్రిందటి సంవత్సరం ఈరోజునే ఈ ఘడియల్లోనే లలిత వెళ్ళిపోయింది" అంటూ మూర్తి భుజంమీద వాలాడు..............మూర్తి స్తంభించి కూర్చున్నాడు. విశ్వేశం మళ్ళీ లేచాడు. "నాయనా! నీవు పొద్దుపోయింది. నాకు నిశిగా ఉంది. ఇంతకు ముందు గాథ ఈ చెట్లతో చెప్పుకుంటున్నా. ఇంతలో నా తండ్రివి నువ్వు వచ్చావు. ఇక వెళ్ళు. నేనూ వెడుతున్నా"నని లేచాడు. ముఖం గాంభీర్యించి ఉంది, మూర్తి "ఎక్కడికీ! అని అడిగాడు — "ఎక్కడికో! ఇంకా యిక్కడ ఉండలేను. ఎంతో దేశం విశాలంగా ఉం"దంటూ – అమ్మా! "అమ్మా!" అంటూ లేచాడు.

మూర్తి "బాబూ! భార్యా పిల్లలను ఏంచేస్తావూ" అన్నాడు. "నాయనా! నేను ఇంతవరకూ భరించలా. అసలు వారు నన్నాశ్రయిస్తేగా! నా ఆశ్రయం పోయింది. చీకుసంసారం వద్దు. పెద్దల ఆశ్రమమే శరణ్యం. నా తల్లి పోయినాగూడా నాకు సమస్థానం చూపింది. అదేం స్వర్గాధిదేవతో. ఇక నాకు శలవు ఇప్పించు. సాకారం తగ్గించిన నిన్ను భాగ్యదేవతగా తలుస్తున్నా. ఈబ్రతుకు కథ నీ కెక్కడన్నా చెప్పుకోవచ్చుగూడా" అంటూ లేచి నమస్కారం చేసి పొదల్లో దూరి పోయాడు.

ఈ కథ అంతా విన్నతరువాత నాకిలా తోచింది. ప్రపంచకంలో ప్రతివాడుకూడా తన తల్లిని అమితంగా ప్రేమిస్తుంది. తనకు తల్లివల్ల లభించవలసిన లాలనా పాలనా లభించకపోతే ఆ మాతృత్వాన్ని ఎవరివల్ల నన్నా అనుభవించాలని కాంక్షపడుతూంటారు. చివరకు తన భార్య అయినా తనను లాలించి పోషించవలెనని కోరుతారు. స్త్రీకి సహజంగానే మాతృత్వము న్నది. ఆమె ఎవరూ కోరకుండానే భర్తకు కావలసిన పోషణము ఇస్తుంది – చేస్తుంది. ఆ పోషణమే అతడు కోరేటప్పటికి ఆమె చీదరించుకుంటుంది. మాతృధర్మమును భార్యయందు వాంఛించి ఫలము పొందనివారు మన కథానాయకుని వలెనే వేదనల పాలయిపోతారు.

మాతృధర్మంకూడా మితిమీరిందంటే సుఖసంసారాన్ని మంటలో కలుపుతుంది. చిట్టెమ్మతల్లి ప్రేమ అటువంటిది. అదే లేకపోతే అతడు వేరే సంసారం పెట్టుకుంటానంటే ఆమె అనుమతించేది. ఆమె సంసారం కూడా సుఖంగా జరిగిపోయేది. వయసు వచ్చిన పెరిగిన మగవాడు కూడా ఆత్మవిశ్వాసం కోలుపోతాడన్న సంగతి ఈ కథలో స్పష్టంగా తెలుస్తోంది. మగపిల్లలకు కానీ ఆడపిల్లలకు కానీ మితిమీరిన అనురాగంతో తల్లిదండ్రులు వారియొక్క భవిష్యత్తును పాడుచేస్తున్నారనే సంగతి గమనించేవరకూ ఈ సంఘంలో బాధలు తప్పవనుకుంటూ మూర్తి యింటికి చేరాడు.

# ప్రకృతిపత్రికా ప్రశంస - ఆశీర్వాదము - సందేశములు

రావుల గోపాలకృష్ణయ్య.

ప్రకృతి వైద్యపరిచారకుడు.

నాకు ఇప్పుడు డెబ్బదిఆరవపడి నడుచుచున్నది. నేను సుమారు ఏబదివత్సరముల నుంచి, అనగా 26 వ సంవత్సరం వయస్సునాకు ఐనప్పటినుంచి, ప్రకృతివైద్యావలంబుడనై నాకు ఉన్న కఠిన మలబంధమును అప్పటికి అమలులోనున్న కూనీమహర్షి గారి అభినవవైద్యశాస్త్రమును అనుసరించి నా వ్యాధిని నయము చేసుకుని యీ జిల్లాలోనున్నూ, మరియితర జిల్లాలలోనున్నూ సలహాలిచ్చి వైద్యమును ప్రజలకు నచ్చునట్లు బోధమూలంగాను చేసి, అనేకరోగములు కుదిర్చియుంటిని. 1910 సం॥ వరకు అనేకరోగములు కుదిర్చినప్పటికి తరువాత వ్యాధి బహిర్గతమైనపుడు మాత్రము ధైర్యములేని కొందరు, మరియొక వైద్యమునకు వెళ్ళి, కష్టనష్టములు, పొందుచూ వచ్చిరి. అందువలన, ప్రకృతి వైద్యముతోబాటు, ఫ్లషింగు దీ కోలన్, న్యూ హైజిన్ ప్రకారం తొట్టివైద్యమునకు తోడుగా 1910 సం॥ లగాయతు జతచేసినాను. 1910 సం॥ లగాయతు 1918 సం॥ వరకు చింతపల్లి దొరసానివారి సహాయముతో గుంటూరులో ప్రకృతి ఆసుపత్రి ఒకటి స్థాపించి, మేనేజిమెంటు చేసియుంటిని. మొదట 2 సం॥ వరకు శ్రీ॥ [illegible] బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారు నాతో జాయింటుగా పనిచేసి తర్వాత రాజమండ్రి వెళ్ళిపోయిరి. అభినవ వైద్యశాస్త్ర ప్రకారంగానున్నూ, డాక్టరు, కె. యల్. శర్మ (పుదుక్కోట)గారి పుస్తకముల సహాయంతోనున్నూ, డాక్టరు. కెల్లాగ్ యం. డి, డాక్టర్ మ్యాక్ ఫేడన్ గార్ల గ్రంథ సహాయములతో అనేకరోగములు కుదిర్చి 1918 సం॥ ఆఖరున ఉద్యోగరీత్యా వంగవోలుకు కోర్టునాజరుగా వెళ్లియుంటిని. గుంటూరులో ప్రకృతిహాస్పిటల్ మేనేజిమెంటు చేసే కాలములోనే కీ॥ శే॥ నారిశెట్టి హనుమయ్య నాయుడుగారు, 1,2 మాసములు, నావద్ద చికిత్సపొందినారు. నేను మొదటనుంచి సర్కారుఉద్యోగములో నుండుటవల్ల డబ్బువుచ్చుకోకుండా నేను సంపాదించిన డబ్బులోనే చాలాభాగం ఖర్చుచేసి వంగవోలు, తెనాలి, బాపట్ల, వేమూరు, ఇంకా యితర గ్రామములలోను జాడ్యములు, బాగుచేసినప్పటికి, నయమైన ఆరోగ్య వృత్తాంతములు మా పై ఆఫీసర్ల భయంతో తెలుపలేకపోతిని.

1919 లో ప్రకృతిపేపరు స్థాపించబడి అప్పటినుంచి యిప్పటివరకు ఆ పేపరు తెప్పిస్తునే యున్నాను. ప్రకృతిపేపరువలన అనేకమంది ప్రకృతివైద్యులయొక్క వాదోపవాదముల వల్ల తేలిన పర్యవసానములు అనేకవ్యాధులు గల్గిన రోగులయొక్క ఆరోగ్యవృత్తాంతములు ప్రకృతివైద్యము దేశములో వ్యాప్తి, యింకా అనేకవిషయములు తెలియును గనుక, వైద్యులకేమి, రోగగ్రస్తులకేమి సామాన్య జనులకేమి, మిగుల నుపయోగకారియగు పత్రికగనుక ఈ పత్రిక ఎల్లపుడు సాగు

నట్లు, తగునహాయం వచ్చునట్లు, ప్రజలకుమన స్సులలో భగవంతుడు తగు అభిప్రాయమును కల్గించుగాక. ఈ ప్రకృతి పత్రికను, చిర స్థాయిగా నుండునటుల భగవంతుని ప్రార్థించు చున్నాను. ప్రకృతిపత్రిక నిర్విఘ్నముగా జరుపుచున్న (అనేక కష్టములకు ఓర్చి) డాక్టరు. పుచ్చా వెంకటామయ్య. యన్.డి. డి.యం గారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిన్నీ, (మొదట స్థాపించిన కీ॥ శే॥ నారిశెట్టి హనుమయ్యనాయుడుగారి ఆత్మకు శాంతిన్ని) భగవంతుడు, చేకూర్చుగాక యని ప్రార్థించు చున్నాను.

నేను 1929 లగాయతు, పింఛన్ తీసుకుని, 14 సంవత్సరములనుండి వేమూరులో నివసించుచూ వైద్యము నడుపుచున్నాను. ప్రకృతి పత్రికకు ఆరోగ్యవృత్తాంతములు తెలుప వలసినవి చాలా యున్నవి. గాని మీరు చెప్పిన ప్రకారం రోగుల గార్డియనుల దస్కతులతో నుండనందున ప్రస్తుతం పంప లేదు. నేను తరుణవ్యాధులలో, నేమి కాలిక వ్యాధులలో నేమి రోగులవద్దనుంచి చికిత్సజరిపే వాళ్ళల్లో ఒకడినిగానుండట వల్లనున్నూ, రోగులకు వైద్యంచేసుకునే విధానం చెప్పినమాత్రమున వారుసరిగా ఆచరించరని (పథ్యమున్నానములు వగైరా) నా అనుభవజ్ఞానములో తేలినందున ప్రత్యేకం ప్రకృతి ఆసుపత్రి యుండి అందులోనైనా చికిత్స పొందవలెను, లేదా రోగి ఆరోగ్యము పొందేవరకు ప్రకృతి వైద్యుడు వద్దనుండి చికిత్స నడిపించవలెను. గాని సలహామీద చేసినంతమాత్రమున అనేక కేసులలో సరియైన ఫలితములు రాలేదు. ప్రకృతి ఆసుపత్రులను ప్రకృతిపత్రికను వృద్ధిపొందునట్లుగా భగవంతుని ప్రార్థించుచూ యింతటితో విరమించుచున్నాను.

N. B: —ఆచ్ఛాగా, స్టీమింగు ది కోలన్ సిస్టం ఒకదానితో కూడా చిన్నదశలో నున్న అనేక జాడ్యములు నయముచేసియున్నాను.

# బ్రహ్మచర్యము

## శ్రీ స్వామిశివానంద సరస్వతి, ఇంగ్లీషుకు తెలుగు

ప్రకృతి రజతోత్సవ సందర్భమున

# నా సందేశము

ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారు, వకీలు
ఒంగోలు

ప్రకృతి పత్రిక రజతోత్సవ సందర్భమున నా సందేశమునుగాని ప్రశంసనుగాని దెల్పుమని పత్రికాసంపాదకులు నన్ను గోరినందులకు నే నెంతయు కృతజ్ఞుడను. శస్త్రచికిత్స యందును నూది చికిత్సయందును ప్రమాణబుద్ధి గల పాశ్చాత్యదేశములలో ప్రకృతి వైద్యవిధాన మాదరణలో నుండియుండ సర్వవిధముల ప్రకృతినే ఆరాధనజేయుమందు మనకు ఇందు విషయమై హెచ్చరిక గావలసిన పరిస్థితి యేర్పడినందులకు మనము చింతింపవలసి యున్నది. ఈ మధ్య అమెరికా దేశమందు ప్రకటింపబడు Ghysical Culture అను మాసపత్రిక యందొక వ్యాసమున సర్వరోగములకు నుపవాసమే శరణ్యమనియు, Cancer రోగమునకు grape Cure పచ్చిద్రాక్షపండ్లే ఆహారము మాత్రమిచ్చి రోగనివారణము జేసితిమనియు ఒక్క గొప్ప డాక్టరుగారు వ్రాసియుండిరి. దానిని జూచిన వెనుక వంగోలులో నా మిత్రులు శ్రీ చెరువు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రెండు మూడు సంవత్సరముల నుండియు తాను Piles మూలవ్యాధితో బాధపడుచున్నాననియు, డాక్టర్లు మూత్రమందు Albumin యుండుటయు, మూత్రమునకు Specific gravity శూన్యమై యుంటయు జూచి Piles మూలవ్యాధి మాన్పుట కష్టసాధ్యమని చెప్పియుండిరనియు నాతో చెప్పిరి. నేను డాక్టర్లతో మాట్లాడగా Specific gravity మూత్రమందు శూన్యమైనప్పుడు ఒకటి రెండు మాసములపైన జీవించుట దుర్లభమని వారు నాకు జెప్పిరి. ఇట్టి స్థితిలో నా రోగి దృఢమనస్కుడై ప్రకృతివైద్య మభ్యసించి, అనుదినము తొట్టిస్నానములును ఎనిమాలును జేయుచు అన్నము వర్జించి నారింజపండ్ల రసమును, పచ్చిద్రాక్ష పండ్లును దిని యొక్క నెల ఈ దీక్ష గడపినంతలో నాల్గవ వారముననే మూత్రమునందలి Specific gravity క్రమక్రమముగ వృద్ధియగుటయు albumin తగ్గుటయు డాక్టర్లు జూచి యాశ్చర్యపడిరి. రోగియొక్క ఆరోగ్యము దినదినవర్ధమానమై Piles మూలవ్యాధి నిశ్శేషముగ నశించి ఆ వ్యక్తి నేటికిని ప్రకృతి వైద్యము వదలక నియమితమయిన యాహారము దినుచు దినమునకు మూడు నాల్గు మైళ్లు నడక నడుచుచున్నాడు. దీక్షలోనుండు మాసము, వారమున కొకమారు మదరాసునుండి వారు పచ్చిద్రాక్షపండ్లు దెప్పించుకొని ఆ మాసమునకు మాత్ర మాయన 100 రూపాయలకు పైన సర్వవిధ ఫలములకును ఖర్చుపెట్టియున్నాడు. పచ్చిద్రాక్షపండ్లు యెట్టి వ్యాధినైనను కుదుర్చ గలవని నాకు నమ్మకము.

కొన్ని సంవత్సరముల క్రిందట Ascites జలోదరవ్యాధి చిరకాలము నంటియుండి వంగోలు మిషను అసుపత్రిలో 24 గంటల వ్యవధి కటాక్షముబొంది మృత్యుదేవత నాహ్వానించియుండిన యొకానొక రోగి 4 రోజులు తొట్టి స్నానముతో కొంత బాధ తగ్గి రెండు మాసముల ఉపవాసదీక్షలో 200 రూపాయల వెచ్చించి అనాసపండ్లు, పచ్చిద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, నానావిధములగు నారింజపండ్లు చక్కెరకేళి వగైరా పండ్లు తెప్పించుకొని తిని ఒకమాసములోపలనే దినమునకు అయిదారు మైళ్ళు తిరిగి, పోయిన యారోగ్యము

మరల దెచ్చికొని ఇంకను 60 సంవత్సరముల వయస్సులో దృఢగాత్రుడై జీవించుచున్నాడు. ఈవ్యాసకర్తయు సుమారు పది సంవత్సరములకు ముందు Ex Ray లో Dilation of the Costa హృద్రోగ జన్యమైన దగ్గు, ఆయాసము మున్నగు బాధలు పడి పాశ్చాత్య వైద్య విధానమునకు విశేషద్రవ్యము వెచ్చించి ప్రకృతివైద్యము వల్ల 58 వ యేట ఇంకను నిర్భయముగ జీవయాత్ర జేయుచున్నాను ప్రకృతి విధానము రోగులకుదెబ్బ వారల బాధల బాపుటయే ఈతని పరమావధి యని యెంచియున్నాను.



శ్రీరస్తు వివాహ మహోత్సవాహ్వాన శుభపత్రిక. శుభమస్తు

శ్లో॥ నమ స్సవిత్రే జగదేకచక్షుషే జగత్ప్రసూతిస్థితినాశహేతవే।
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే విరించినారాయణశంకరాత్మనే ॥

అయ్యా,

స్వస్తిశ్రీ చాంద్రమాన సుభానునామ సం॥ర ఫాల్గుణ శు ౧౧ లు భానువారం 5-3-44 తేదీ రాత్రి ఘ 31-48 వి (గం. 8-24 ని.) లకు పునర్వసూ నక్షత్రయుక్త సాయనతులాలగ్న పుష్కరాంశ యందు

బెజవాడ కాపురస్థులు, కొలిపాక కృష్ణయ్యగారి ద్వితీయ పుత్రులు ప్రకృతి ఉద్యమసేవకులు అగు చి. ఆదినారాయణశర్మకు

బెజవాడ కృష్ణా అగ్రహార కాపురస్థులైన కాకాని సాంబశివరావుగారి ప్రథమ పుత్రిక చి. సౌ. హేమ శ్యామల కన్యకా రత్నమును

ఇచ్చి బెజవాడ, పూర్ణానందంపేటలో మా మిత్రులగు బ్రహ్మశ్రీ కోటా సుబ్బారావుగారి భవనమందు పాణిగ్రహణ మహోత్సవము జరుపుటకు దైవజ్ఞులచే సుముహూర్తము నిశ్చయింపబడినది గాన ఏతత్సుముహూర్తమునకు తాము కుటుంబ బంధుమిత్ర పరివారసహితముగా దయచేసి వధూవరుల నాశీర్వదించి నాచేయు సపర్యల గైకొని నన్నానందింపజేయ ప్రార్థించుచున్నాను.

బెజవాడ. 20—2—44. } మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు విధేయుడు,
చెన్నుభొట్ల భానుమూర్తి.
ప్రకృతి ధర్మపరిషత్, సత్యనారాయణపురం.

డాక్టరు పుచ్చా వెంకటాప్రమయ్య, అయ్యంకి వెంకటరమణయ్య, డాక్టరు వాడపల్లి మురహరిరావు, డాక్టరు వేగిరాజు కృష్ణంరాజు గార్ల అభినందనములతో.

# ప్రకృతి ప్రశంస

రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు

---

ప్రకృతి వైద్య సిద్ధాంతము నవీన వైద్య విధాన పరిశోధనలలో కెల్ల ఘనమైన దని నా నమ్మకము. 28 సంవత్సరముల నా అనుభవములో భగవత్కటాక్షమునకు లోబడి ప్రకృతి వైద్యమును సేవించినవారిలో అపజయము అరుదు. కాని ఈ విధానమునకు జిల్లాల వారీగా వైద్యశాలలు, పరిశోధన కేంద్రాలు, ఇంకను శాస్త్రదృష్టితో పరిశోధనలు లేబరేటరీను జరుగవలసియున్నవి. అట్టిదానికి దేశీయులు సహాయపడుదురు గాక.

ప్రకృతి వైద్య విధాన వ్యాప్తియందు కూడ ఆంధ్రదేశమే ముందడుగు వేయుట గర్వించదగిన విషయము. ప్రకృతి పత్రిక ఈ విధానమునకు జ్యోతివలె ప్రకాశించుచున్నదని చెప్పుట అతిశయోక్తి కాదు. ఈ రజతోత్సవమునకు పత్రిక యెంతయు తగియున్నది. ఇట్టి విజయానికి కారకులైన ప్రకృతి వైద్య శేఖరులగు మా మిత్రులు పుచ్చా వెంకట్రామయ్యగారిని, నిరాడంబర నిర్మాణ కార్యదక్షులగు మిత్రులు శ్రీ వేంకటరమణయ్యగారిని అభినందించుచు, ప్రకృతి పత్రికను అధమము గ్రామమునకు 5 ప్రతుల చొప్పన నయినా తెప్పించి ఈ ఉద్యమానికి సహాయపడవలె నని దేశీయులను కోరుచున్నాను. పరమేశ్వరుడు పై మిత్రులకు ఈ ఉద్యమాన్ని ఇతోధికజయముతో కొనసాగించుటకు శక్తి సంపదలను ఇంకను ఇచ్చుగాక !

## ప్రకృతి ఉద్యమము - నా సందేశము

కలిదిండి గంగరాజుగారు కేశవరం.

ఈ ప్రకృతి కార్యాలయములోను, ఈ చికిత్సావిధానములోను నాకు అయిదారు సంవత్సరములుగా పూర్తి పరిచయము కలదు. మా స్వగ్రామమున కేశవరంలో బ్రి॥ శ్రీ॥ కృష్ణంరాజుగారిచే నడుపబడు ప్రకృతి చికిత్సాలయములో వారు చేయు చికిత్సలు, దాని ఫలితములు, నా స్వానుభవమును విడివిడిగా వర్ణించిన మొదల దీనియందు అనుభవము లేని వారికి ఆశ్చర్యము కొలుపక మానదు. ఈప్రకారం 25 సంవత్సరములుగా నీ యుద్యమమును నీకార్యనిర్వాహకులు చేయుచున్న కృషికి రావలసినంత తోడ్పాటు రాకపోవడానికి ఈ దేశం దౌర్భాగ్యం తప్ప వేరు కారణం లేదు. ఈ కార్యనిర్వాహకులు చేసిన అమోఘమైన యీ కృషి మూలముగానే యీ మాత్రమైనా యీ ఉద్యమము తల యెత్తినందులకు వారి కృషికి ఎంతయు అభినందించుచున్నాను. ఈ ఉద్యమాభివృద్ధికి పూర్తి తోడ్పాటుయిచ్చి రక్షించవలసినదిగా భగవంతుని నిత్యము ధ్యానము చేయుచూ యీ నా సందేశమును అందచేసికొన్నాను.

---

## సుఖసంసారము

పుస్తకము తయారైనది. వెల క్యాలికోబైండు రు 4—0—0 అట్టబైండు 3—0—0. ఇదివరకే సొమ్ము యిచ్చినవారికి క్యాలికోబైండు రు 3—0—0కును అట్టబైండు రు 2—8—0కును అందచేయుదుము. పోస్టేజి ఖర్చులకు రు 0—11—0 పదకొండు అణాలు వారే భరించవలయును.

ప్రకృతి వైద్యులకు చక్కటి అవకాశము

# ప్రకృతి పత్రికా చందాదారులకు హెచ్చరిక

ప్రకృతి కార్యాలయములో లోగడ మేనేజరుగా పనిచేయుచున్న లక్కరాజు సుదర్శన రావుగారు, 1944 జనవరినుండి పనిచేయుటలేదు. కాన ఆయనపేరునకు ఎవ్వరును మనిఆర్డర్లు, రిజిస్టర్లు పంపకూడదు. మనిఆర్డర్లు రిజిస్టర్లు ఉత్తరములు అన్నియును ప్రకృతి కార్యాలయ ట్రస్టు లేక ప్రకృతి పత్రిక, బెజవాడ అని వ్రాసిన చాలును.

ఇట్లు,
కార్యదర్శి.

## మా సంకల్పము

దైవానుగ్రహమువలన యిప్పటికి 26 వ సంపుటము ఆరంభించుచున్నాము. ఇంతవరకును యీ పత్రిక నిర్విఘ్నముగా సాగుటకు తోడ్పడిన పత్రికాపాఠకులకు, లేఖకులకు, తదితర అభిమానులకు మా హృదయపూర్వక ధన్యవాదముల నర్పించుచున్నాము. ఈ కాగితపు కరువు రోజులలో ప్రతి చందాదారు మాకు సహాయము చేయనియెడల పత్రికను తృప్తిగా నిర్వహింప జాలము. మీలో మీ బంధువులకును, స్నేహితులకును నీ పత్రికలోని అమూల్య వ్యాసములను చూపించి చందాదారులు ఎక్కువగా చేరునట్లు సాయపడినయెడల పత్రికను నిర్విఘ్నముగా జరుపజాలుదుము.



## ప్రకృతి కార్యాలయ ట్రస్టు 1943 సం॥ సెప్టెంబరు నెల జమా ఖర్చులు.

జమ : వెనుకటినెల నిలువ 98-11-4; ప్రకృతి పత్రిక 103-11-0; పుస్తకములు 88-11-0; యిండ్ల అద్దెలు 12-0-0; రంగు కాగితాలు 0-15-0; వెరశి 304-0-4.

ఖర్చులు : ప్రకృతి పోస్టేజీలు 12-6-0; పుస్తకముల పోస్టేజీలు 7-15-9; మిస్‌లేనియస్ 1-1-0; జనరల్ పోస్టేజీలు 2-5-6; యిండ్ల పన్నులు 6-15-1; నౌకర్లు 16-0-0; అప్పులు తీర్చింది 5-0-0; అప్పులు యిచ్చింది 2-8-0; భరణం 25-0-0; నిల్వరొఖ్ఖం 224-13-0; వెరశి 304-0-4.

## అక్టోబరు నెల జమా ఖర్చులు.

జమ : వెనుకటినెల నిలువ 224-13-0; ప్రకృతి పత్రిక 68-15-0; పుస్తకములు 5-8-0; ప్రింటింగు అడ్వాన్సు 336-0-0; బాకీలు 18-0-0; యిండ్ల అద్దెలు 26-0-0; అడ్వాన్సులు 3-8-0; వెరశి 687-12-0.

ఖర్చులు : ప్రకృతి పత్రిక 336-0-0; ప్రకృతి పోస్టేజీలు 18-0-9; చందా కట్టినది 7-8-0; మిస్‌లేనియస్ 3-0-3; పుస్తకములు 2-0-0; జనరల్ పోస్టేజీలు 2-15-6; యిండ్ల పన్నులు 15-7-10; నౌకర్లు 16-4-0; భరణం 5-0-0; బాకీలు 4-4-0; నిల్వ రొఖ్ఖం 282-5-8; వెరశి 687-12-0.

యల్. సుదర్శనరావు,
మేనేజరు.

# ప్రకృతి

సచిత్ర సహజవైద్య మాసపత్రిక

బెజవాడ.

ఈ ప్రస్తుత నాగరిక ప్రపంచములో మానవుడు ప్రకృతి నియమములను అనుసరింపక తాత్కాలిక కామ్య సుఖముల కాసపడి స్థిరమైన సౌఖ్యమును తెలిసికొనక వెనువెంటనే దుఃఖము ననుభవించుచున్నాడు. మానవుడు ఈ ప్రకారముగ అనుభవించుచున్న శారీరక, మానసిక వ్యాధిబాధలనుండి తప్పించుకొను సాధన లేవో, మందు - ఆపరేషను లేకుండ భూమిమీదనే స్వర్గమును అనుభవించుట ఎట్లో, ఈ పత్రిక వివరించును. మందులు, ఇంజక్షనులు అవసరము లేకుండా అతిమూత్రము, క్షయ, కుష్ఠు, రాచపుండు మొదలగు అసాధ్యవ్యాధులను కూడా గాలి, సూర్యకిరణములు, జలము, ఉపవాసము, ఫలాహారము, అధఃశయనము, బ్రహ్మచర్యము, మట్టి, వ్యాయామము, మర్దన మొదలగు వానివలన నిర్మూలించు సులభమగు విధానములను తెలుపును.

సంవత్సర చందా రు 3-0-0 లు మాత్రమే.

---

# అందరూ వైద్యులు కావాలి

**ఎందుకు?** ఒకరు రోగులు - ఇంకొకరు వైద్యులు అవటం మానవజాతికే లోపం - అందరూ వైద్యులు కావాలి - రోగాలు పోవాలి - ప్రకృతిధర్మం వ్యాప్తికావాలి.

**ఎట్లు?** ప్రకృతి గృహవైద్యపాఠములు చదవండి

ఇందు వివిధ ప్రకృతి చికిత్సావిధానములను గురించి తెలుపు 24 పాఠములుకలవు. ప్రతిపాఠం చివర ప్రశ్నలు కలవు. ఒక పాఠం చదివి ప్రశ్నలకు జవాబు వ్రాస్తే ఆ జవాబులను దిద్ది పంపుదుము.

ఇంతకంటె మంచి సావకాశం దొరకదు

వెల రు 2-8-0. ప్రకృతి కార్యాలయట్రస్టు, బెజవాడ.

## ప్రకృతి చికిత్సా గ్రంథములు

### సూర్యకిరణచికిత్సాగ్రంథములు

| | వెల |
|---|---|
| [illegible] | 4 8 0 |
| ప్రౌఢప్రభాకరం | 2 0 0 |
| [illegible] | 0 6 0 |
| [illegible] | 0 6 0 |
| [illegible] | 0 5 0 |
| [illegible] | 0 6 0 |

### జలచికిత్సాగ్రంథములు

| | |
|---|---|
| [illegible] | 3 0 0 |
| [illegible] | 0 12 0 |
| [illegible] | 0 12 0 |
| [illegible] | 0 6 0 |
| [illegible] | 0 4 0 |
| [illegible] | 0 6 0 |
| [illegible] | 0 6 0 |

| | వెల |
|---|---|
| కూనేమహర్షి బోధ | 0 2 0 |
| జలచికిత్స | 0 1 0 |

### ఆహారశాస్త్రగ్రంథములు

| | |
|---|---|
| నిర్వికారభావిజీవనము, కొబ్బరినిగూర్చి | 1 8 0 |
| ఆహారము 1. భాగము | 0 12 0 |
| డిటో 2. భాగము | 0 4 0 |
| పచ్చితిండివలని ప్రయోజనములు | 0 12 0 |
| తెల్లచక్కెరవలని విపత్తు | 0 6 0 |
| తేనీరు విషతుల్యము | 0 6 0 |
| జంబీర చికిత్స | 0 3 0 |
| సమరసాహారము,విరుద్ధాహారమిశ్రమం | 0 2 0 |
| ఆహారసమ్మేళనపు గోల | 0 2 0 |
| అల్యూమినియంపాత్రలు | 0 2 0 |
| భోజన విధానము | 0 2 0 |
| సజీవాహారము | 0 1 0 |
| ఆహారసంస్కరణము | 0 4 0 |

చిరునామా: ప్రకృతి కార్యాలయ ట్రస్టు, బెజవాడ.

